# సమీక్షణ

రచన:

డాక్టరు. కేతవరపు వెంకట రామకోటిశాస్త్రి

క్వాలిటీ పబ్లిషర్సు

విజయవాడ-2

# అనుక్రమణి

# వ్యాసులవారి దేవయాని-పాత్రచిత్రణము

ప్రతిభా వ్యుత్పత్తు లాధారముగ—రసోద్రేక కల్పనావైశిష్ట్యము గలిగి, సహృదయంగమముగా వ్యక్తీకరింపఁబడిన వచస్సమూహసమాహారస్వరూపనే వాఙ్మయము కొన్ని గుణవిశేషములను బురస్కరించుకొని సాహితీవేత్తలు వాఙ్మయమును గొన్ని శాఖలుగా విభజించిరి. ఐతిహాసిక, పౌరాణిక ప్రాబంధిక, నాటకీయశాఖలిందు ముఖ్యములు. కాలక్రమమున నవల - నాటిక కథానికఖండకావ్యములు బయలు దేరినవి. మిగిలిన శాఖ లన్నింటికిని బీజము లితిహాసముల యందుఁ గలవు. భారతీయవాఙ్మయమున మహేతిహాసము భారతము. కర్త శ్రీకృష్ణద్వైపాయనులవారు. వారికే వ్యాసులవారని నామాంతరము—పురాణములందుఁ గథాకథనము ముఖ్యము. ప్రబంధములందు వర్ణనలకుఁ ప్రాధా

న్యము హెచ్చు. నాటకములందుఁ బాత్రచిత్రణేత్యాది శిల్పము గమనింపఁదగిన విషయము. వీని నన్నింటిని దన యందిమిడ్చికొనినవాఁడే ఐతిహాసిక వాఙ్మయనిర్మాత కాఁగలఁడు. లేనిచో నితిహాసమురక్తి గట్టదు. భారతేతిహాసమును నిర్మించిన శ్రీకృష్ణద్వైపాయనులు బ్రాహ్మీమయమూర్తి. ప్రస్తుతము వారి పాత్రచిత్రణకౌశలమును దర్శించుటయే మన పని.

మనస్తత్త్వము వ్యక్తినిష్ఠము. అది చాల విచిత్రమైనది. వ్యక్తి నుండివ్యక్తికది మాఱును. స్థూలదృష్టికిఁ గొన్నిచోటులఁ గనుపించక పోయినను సూక్ష్మపరిశీలనము వలన వైవిధ్యము స్ఫురించును. దీనిని బట్టియేవ్యక్తియొక్క-ప్రవర్తనాదికములుండును. ఇవి క్షణక్షణ భిన్నములునుపరస్పరవిరుద్ధములునుగావువీనియందుసూత్రప్రాయముగా నెడతెగనితన మొకఁడు ప్రస్ఫుటముగా నుండును. నశ్వరభావావేశమునఁ గొంత వైలక్షణ్యము గోచరించినను, వ్యక్తిని నిడుఁద్రాటఁబోనిచ్చి గమనించినచో సమత కనుపించును. ఇట్లు భిన్నములైన మనస్తత్త్వములతోనున్న వ్యక్తులను శాస్త్రజ్ఞులు స్థూలముగా, మూఁడువిధము లని విభజించిరి. (1) Instinctine character (2) Emotional character (3) Sentimental charcter రెండవ దానిని 'ఉద్రిక్తపాత్ర' అని నేను వ్యవహరింతును. దీనియందు మిగిలిన రెండింటికంటెను విశిష్టత-భిన్నత గోచరించును, ఈ పాత్రములు శక్తములు. మిశ్రితభావసంయుతములు. ఈ

పాత్రల కృత్యములు క్రమవిరహితములు—స్థైర్యాభావములు నిరాటంకములు — అయి ఆశ్చర్యజనకములుగా నుండును.

దేవయాని యుద్రిక్తపాత్ర. పాత్రల శీలస్వభావాదులను మలంచుశక్తి మనస్తత్త్వమునకుఁ గలదు. అది పరిసర వాతావరణానుగుణముగా శక్తిమంత మగును. అసలు వాఙ్మయమునఁ బాత్రచిత్రణము రెండు విధములు. జీవిత మందలి విశేషఘట్టములను వర్ణించుట మొదటిది. వాఙ్మయ శిల్పమున కనుగుణమైన జీవితమందలి ప్రతి యంశమును వర్ణించుట రెండవది. వాఙ్మయశాఖా వైశిష్ట్యమునుబట్టి యీ పద్ధతులవలంభింపఁబడును. ఇతిహాసములందు మొదటి మార్గమే యనుసరణీయము. ఏల నన, అందు కథ విశాలము. ప్రధానకథాసూత్రముతో నే మాత్రము సంబంధమున్న ప్రతిపాత్రయుఁ బ్రవేశించి తన వ్యక్తిత్వమును నిలుపుకొనవలయును. ప్రధానకథాగతి కాటంకములుగా నీ పాత్రలు నిలువరాదు. అట్లని ప్రవేశమును దొలఁగించరాదు. కనుక జీవితమందలి విశేషఘట్టములను బ్రదర్శించుట చాలును. దేవయాని యట్టిపాత్రలలోఁ జేరును. భారతమునకు గౌరవ-పౌరవులకథ బ్రధానము. పౌరవులకు మూలపురుషుఁడు పురువు. వాని సవతితల్లి యనవచ్చును దేవయానిని. నిజమునకుఁ ప్రధానకథతో సంబంధ మంతగా నామెకు లేదు. ఆమె యుండుటవలననే పురువునకు స్థిత్వ మేర్పడినది. కనుక దేవయానికి భారత కథతోఁ

ప్రత్యక్షసంబంధము లేకపోయినను బరోక్షమునఁ బ్రాధాన్యము గలదు.

శ్రీకృష్ణద్వైపాయనులామె జీవితమందలి మూఁడు ఘట్టములనే చిత్రించినారు 1. కచునితోఁ బ్రణయము 2. శర్మిష్ఠతోఁ బంతము. 3. యయాతిపట్లఁ దిరస్కారము. మొదటిదానివలన రెండవది—రెండవదానివలన మూఁడవది సంభవించినవి.

మొదటి మారుగా దేవయాని ప్రశంస దేవలోకమున వచ్చినది. మృతసంజీవని దెచ్చుటకు శుక్రాచార్యుల యొద్దకుఁబంపుచు దేవతలు "త మారాధయితుం శక్తో భవాన్ పూర్వావయా కవిమ్. దేవయానీంచదయితాంసుతాం తస్య మహాత్మనః। త్వ మారాధయితుం శక్తో నాన్యః కశ్చన విద్యతే। శీలదాక్షిణ్యమాధుర్యై రాచారేణ దమేనచ! దేవయాన్యాం హితుష్టాయాం విద్యాంతాం ప్రాప్స్యసి ధ్రువమ్." అని కచునితోఁ జెప్పిరి. దేవయానిని దుష్టి నందించవలసినదిగాఁ జెప్పుటలో విశేషము గలదు. ఉశనునియొద్దనున్న మృతసంజీవని బడయుటకు వాని కుమార్తె నేల సంతుష్టి పఱుపవలయు ననఁగా దేవయాని సంతుష్టి శుక్రునకుఁ బ్రధానము. అనఁగా నామెను సంతోషపఱచుటయే వాని జీవిత పరమావధి. కనుకఁగచుఁడు ముందుగా దేవయానినిసంతోష పెట్టి యామె మనసున కెక్కినచో నెప్పుడో యొకనాఁడు కచుని రాకలోఁగల యుద్దేశ్య మామెకుఁ దెలియకతప్పదు. ఆ యుద్దేశ్యము తన తండ్రివద్ద నున్న మృతసంజీవని విద్య బడయుటయే కనుక ఆమె కచున కా విషయమున సహా

యము చేయఁగలదు. అనఁగాఁ దండ్రితోఁజెప్పి యిప్పింపఁ గలదు. అసలు శుక్రుఁడు మృతసంజీవని కచున కొసఁగుట విచారింపఁదగిన విషయము. ఏ మన దేవదానవయుద్ధము లందు మరణించిన దానవులను శుక్రుఁడా విద్యవలన బ్రతి కించుచున్నాఁడు. దేవతలును దానిని కోరియే పంపిరి. దేవతల కా విద్య యున్నచో దానవులనుసులభముగా జయింపవచ్చు ను. కాని శుక్రుఁడు దానవపక్షపాతము గలవాఁడు. అతఁడ సురాచార్యుఁడు. ఆ విద్య కచున కొసంగినచోఁ దానుగా దానవులను సంహరించినట్లు స్వామిద్రోహము. అటువంటి బలవత్తరమైన విద్యను సహితము దేవయాని సంతోషము కొఱకుఁ బరుల కిచ్చుటకు శుక్రుఁడు సంసిద్ధుఁడని దేవతలకు దెలిసిన దనుటవలన శుక్రునకు దేవయాని పట్లఁగల వాత్స ల్యము, మమకారము, పాఠకులూహించుకొనవలసిన దేగాని వ్రాయనలవి గాదు. తండ్రియొక్క స్థితినిగూడ గమనింపక యామె మంకుపట్టు పట్టియైనను దండ్రిచేతఁ దానుదలఁచిన కార్యము చేయించుట లక్ష్యము. ఇందువలన శుక్రున కామెయందుఁ గల మమకార మామె నదుపాజ్ఞలలో నుం చక, ఎంత విశృంఖల మొనరించినదియు స్పష్టమే. అట్టి విశృంఖలత యొకనాఁడు జనించదు. చిన్నతనమునుండియు నామె కది యలవాటై యుండవలయును. తల్లి యైనను గొంత కట్టుబాటులో నుంచ లేదాయనిన, తల్లి యేయున్నచో నింతదూరము తండ్రినిగూర్చియే ప్రసంగింప నేల ? మాతృ వియోగమువలన దేవయాని బాల్యమునుండియు, సహజ మైన వాతావరణమునుండి దూర మైనది. పిల్లలను బెంచు

కొను విషయమునఁ దల్లిదండ్రు లిరువురును గొంత కొంత భారము వహింప వలయును. అందును దల్లి యధికముగా జాగరూకత వహింపవలయును. తల్లి పెంపుడువిధానమే బిడ్డ భావిజీవితమును దీర్చి దిద్దును. దేవయానికిఁ దల్లియే లేదు. ఇఁక నామె విషయమును జెప్పవనిసిన దేమి? తండ్రి పెంపకమువలన రావలసిన పెంకెతనము - అభిజాత్యము ఉద్రేకము మొదలైన గుణవిశేషము లన్నియు నామెకు సంక్రమించినవి.

కచుఁడు శుక్రునియొద్దకు వచ్చినాఁడు. శిష్యుడైనాఁడు. నృత్య గీతాదులచేతను, ఫలపుష్పములచేతను దేవయానిని సంతోషపెట్టుట మొదలిడినాఁడు. అసూయాపరులైన రాక్షసు లొకనాఁడు కాననమున నొంటరిగా నున్న కచుని జంపి వృకములచేతఁదినిపించిరి. సూర్యుఁడ స్తమించినాఁడు. గోవు లింటికి వచ్చినవి. కచుఁడు రాలేదు. దేవయానికిఁ దోఁచలేదు. తండ్రికడ కేఁగి విషయము విన్నవించుకొని "తంవినానచజీవేయమ్" అనినది. కచుఁడులేనిచోఁ దాను బ్రతుకలేకపోవుటయేమిటికచుఁడుపురుషుఁడుఆమె స్త్రీ ఒకపురుషుడు లేనిచోనొకస్త్రీబ్రతకలేకపోవుట, ఆస్త్రీకి, ఆ పురుషు డాలంబనమైనచో సంభవించును. ప్రస్తుతము దేవయాని మాటలను బట్టి తనకుఁగచుఁ డాలంబన మనియు - అతడు లేనిచోఁ దాను బ్రతకజాల దనియు స్పష్టము. అనఁగానామె వానిని ప్రేమించిన దనుట. ఇంతవరకు నా విషయమును వ్యాసులవారు పేర్కొన లేదు. కాని యీ ప్రేమ హఠాత్తుగాఁబుట్టియుండదు. కొంతకాలమునుండి

యామె హృదయమున నుద్భవించి నసలు తొడుగుచుండ వలెనా ప్రేమలత. లేనిచోఁ ప్రస్తుత మా మాట యామె పలుకలేదు, అవసరమును లేదు. తుదకు శుక్రుఁడు కచుని బ్రతికించినాఁడు.

మరల నొకమారు రాక్షసులు కచుని జంపి బూది చేసి సురలోఁగలిపి శుక్రాచార్యునిచేఁ ద్రాగించుటయు – దేవయాని కోర్కెననుసరించి మృతసంజీవని విద్య కచున కుపదేశించి శుక్రుఁడు తనను, కచుని బ్రతికించుకొనుటయు జరిగినది. కచుఁడు వచ్చిన పని పూర్తియైనది. కనుక దేవ లోకమునకుఁ బయన మైనాఁడు ఈ విషయమును దేవ యాని కెఱుకపఱచినాఁడు. ఆమె తన మనోగత మైన యభిప్రాయమును వ్యక్తము చేసినది. కచుని కట్టియూహ లేదు గనుక నాతఁడులిక్కిపడి వెంటనే గురుపుత్రీ సహో దరి యనినాఁడు. ఆ మాట కామె మనసు చివుక్కు మని నది. వానినుండి యట్టి సమాధానము నామె కలలో నైనను శంకించి యుండలేదు. కచుఁ డనిన మాట శల్యమువలె హృదయమున గ్రుచ్చుకొనినది. తననుగాదనుచున్నాఁడు కచుఁడు. ఇతః పూర్వ మామెను గాదనినవారులేరు. ఆమె చెప్పినది కాదనఁబడఁగల దని గూడ నామె కంతకు బూర్వము తెలియదు. తండ్రి యామె నా విధముగా పెంచి నాఁడు. తనను కచుఁడు మాత్రము నిరాకరించినాఁడు. వానియందుఁదనకుఁగల యను రాగమును– సౌహార్దమును వ్యర్థము లైనవి. ఆమె కాగ్రహ మువిక్కి వచ్చినది. విద్య వలన రావలసినది సంస్కారము. దేవయాని తలఁచిన

సంస్కారము కచునిలో లేదు. కనుక నామె కచునితో 'నీ చదువువలన నీకు ఫలితము కలుగ దనెను. అదే వానికి శాపమైనది. వానికిని నాగ్రహము వచ్చినది. ఇంత శ్రమపడి యా విద్యనుగైకొని దివి కేఁగుచున్న తన నీ యపశకునపుఁ బలుకు దేవయాని పలికినది. శుక్రుని కూతురు. జ్ఞాని. సహోదర తుల్యుని బ్రేమించుట జుగుప్సాకరము. ఆమెకే గాదు. ఆమె కులమునకే తలవంపులు. కనుక నామెతో కచుఁడు 'కుల మర్యాదనైనను పాటించని నిన్ను కులము వారు పెండ్లియాడ' రనినాఁడు. ఆమెకు శాపము. కచుఁడు దేవలోకమున కరిగినాఁడు.

మొదటి ఘట్టము ముగిసినది. ఈ విషయమున ఉద్రిక్తపాత్ర తవీగినది. ఒకవిషయమునపజయమును స్వీకరించినను ఆపాత్ర యంతటితో నిలువదు. మరొకదానికిఁ బ్రాఁకు, లాడును. విజయమును సాధించవలయుననుబట్టుదలయుద్రిక్తపాత్రములం దధికముగా నుండును. దేవయాని విషయమును నంతియ. అపజయమునఁ గ్రుంగిపోవలసియుండగాఁ దేరుకొని పురోగమించుటయాశ్చర్యమును గలిగించక తప్పదు. మన మనుకొను నట్టు ఉద్రిక్తపాత్రజీవితము గడువదు. నిమ్నోన్నతములాజీవితమునదఱచు సంభవించును. ఇఁకఁ గచుని విషయమామెకుఁ బట్టదు. జరిగిన దేదో జరిగినది. లేనిదానికిఁ బోయినదానికి వగచుట సునిశితమైన దూరాలోచనలేకపోవుట. తనను దిరస్కరించిన కచుఁడు వెళ్ళిపోయినాఁడు. ఇఁక దన నెవ్వరును దిరస్కరింపరాదు. అందరును దనను గౌరవించవలయును. ఆ విధముగా

దాను చేసికొనవలయును. తనకుఁ దన తండ్రి యొసఁగఁ గలదు. ఆభిజాత్యముమూర్తీభవించినది. ఇప్పటి మనోవికార మొకవిధము. ఈమనోవికారములే జీవితమున గొప్పమార్పులు కలిగించును. స్థూలదృష్టితోఁ జూచిన మనోవికారములు రెండు రకములు. 1. అనురాగమయము. 2. అసూయామయము. మొదటిదానికి స్థైర్యము - సౌఖ్యము-మంచి మనుగడ ఫలితములు. రెండవదానివలనవిచ్ఛిత్తిభిన్నతవ్యసనముదుఃఖము నైచ్యము సంభవించును. ఈ మనోవికారములు ఆత్మసంయమనమువలన నవధులు దాఁటకయుండును. ఈ సంయమన ముద్రిక్తపాత్రల కుండదు. కనుక మనోవికారములు విజృంభించును. వాని విజృంభణము ననుసరించియే పాత్ర యుండును. దేవయానికి ననురాగమయమైనమనోవికారము కచునితో నశించినది. ఇఁకఁ బ్రకోపించినది యసూయామయము. జీవితాంతమువరకు నున్నది. శర్మిష్ఠవిషయమున నీ మనోవికారము బాగుగాఁబనిచేసినది. శర్మిష్ఠ దేవయానిని బావిలో నెట్టినది [వస్త్రములవిషయమున నైన కలహము కారణము:—] నెట్టుటయేగాక తనను దండ్రిని నాశ్రయించుకొని బ్రతుకువారిగా నిరూపించి పలికినది. నిజమునకు శుక్రుఁడు, శర్మిష్ఠ తండ్రియు, రాక్షసరాజును—ఐన వృషపర్వణునియొద్ద నాచార్యుఁడే యయినను శర్మిష్ఠమాటలు దేవయానికి సహింపరానివైనవి. ఆమెను నోదార్చి పురమునకుఁ గొనిపోవుటకు వచ్చిన శుక్రునితో నామె పలి

కిన "వాగ్దురుక్తం మహాఘోరం దుహితుర్వృషపర్వణః మమ మథ్నాతి హృదయమ్ అగ్నికామ ఇవారిణమ్. నహ్యతో దుష్కరతరం మన్యేలోకేష్వపిత్రిషు, యస్స పత్నశ్శ్రియం దీప్తాం హీనశ్రీః పర్యుపాసతే। మరణం శోభనం తస్య..." అనువాక్యములు గమనింపఁదగినవి.

ఆమె రాక్షసరాజు రాజ్యములో నడుగిడుట కంగీకరింపలేదు. శర్మిష్ఠను సాధించవలయును. చెలికత్తెలతోఁగూడి గర్వమునఁదనను నూతత్రోసి చనిన శర్మిష్ఠ తనకు దాసి గావలయును. ఈ విషయమును దానుగా నేల బయట పెట్టవలయునుః తండ్రిని రాజ్యము వదలి రమ్మనినచో రాక్షసరాజుగుండెనీరగును. అతడే కాళ్ళబేరమునకువచ్చును. అపుడు చూచుకొనవచ్చును. అనుకొనినట్లు వృషపర్వుణుఁడు వచ్చినాఁడు. దేవయానిని బ్రతిమాలుకొనినాఁడు. ఆమె "దాసీం కన్యాసహస్రేణ శర్మిష్ఠా మభికామయే"అనినది. అతఁడంగీకరించినాఁడు. శర్మిష్ఠదాసియైనది దేవయానికి. ఈ సందర్భమున నుద్రిక్తపాత్ర జయించినది. అనురాగమున నోడినది. అసూయతో నెగ్గినది. ఇట్టి విజయముతో నసూయ నశించలేదు. కారణ మేమన శర్మిష్ఠ తన కందుబాటులోనున్నది. అసూయ యభివృద్ధియగుచునేయున్నది. అనురాగము నశించుటకుఁగారణము కచుఁడు తననుండి దూరమైనాఁడు.

తరువాత యయాతితో దేవయానికి వివాహమైనది. శర్మిష్ఠ కన్యాసహస్రయుతముగా నామె ననుసరించినది. శయనవిషయమునశర్మిష్ఠను బరిత్యజించమని శుక్రుఁడుయయాతికి

జెప్పినాఁడు. దేవయాని యయాతితోఁగొంతకాలముసంసారసుఖ మనుభవించినది. యయాతిపట్ల నామెకుఁదిరస్కారభావము కలిగినది. కారణము యయాతివలన శర్మిష్ఠకు సంతానము కలుగుటయే, యయాతితనను వంచించినాడు. శర్మిష్ఠతో సంగమము—వినరానిది. తాను బట్టుదలమీఁద దాసిగాఁజేసికొనినదానితోఁ దనభర్త సంగమించుటయా? తనకుఁదలవంపులు. దాసీసంగమము నీచము. తనకుఁ గూర్చి భర్తయే దాసీ జనముతో — సరసములకును, సంగమము నకును దిగినచోఁ దనకు గౌరవమునశించి నట్లే. ఇఁకవారు తనను లెక్క చేయరు. ఇంత బ్రతుకు బ్రతికి యింటివెనుకఁ జచ్చినట్లు దాసీజనముచేతఁ బరిహాసింపఁ బడుటయా తాను? వలనుపడదు. దీనికిఁ దగిన ప్రతీకారము చేయవలయును. ముందు యయాతికి బుద్ధివచ్చినట్లు చేయవలయును. భర్త యైనమాత్రమునఁదన యిష్టమును బరికింపక సంచరించుట యయాతికిఁ దగదు" భార్యను గించపరుపవలయునని ఎచటఁ గలదు? ఇరువురును వ్యక్తులే. ఎవరి వ్యక్తిత్వము వారి కున్నది. దండింపవలసివచ్చినచోట భర్తనైనను దండింపవలసినదే. తనపైఁగల పగను దీర్చుకొనుటకు శర్మిష్ఠయయాతిని వలలో వేసికొనుటకు యత్నించినది. ఆ యత్నము కొనసాగనీయరాదు. అందు కనియే దేవయాని తండ్రికడ కేఁగి సత్యమును విన్నవించుకొన్నది. ఆమె ననుసరించియే వెళ్ళినాఁడు యయాతి. శుక్రుఁడును గూతురి దైన్యమును గాంచి క్రుంగిపోయినాఁడు. యయాతిపై నాగ్రహమువచ్చినది. యౌవనమదమునఁ జేసిన దుష్ట

చేష్ట సహింపరానిది. కనుక కారణభూత మైన యౌవనమే పోవలయును. అనఁగా ముసలితనము రావలయు ననుట. ఈ మాట శుక్రుఁడు పలికినాఁడు. నిజమునకు, యయాతిని శపించినట్లున్నను, ఫలితము దేవయానికే చెందును. ఆ సమయమున శుక్రుఁడీవిషయమును గమనించలేదు. దేవయానియు నివ్వెఱపోయినది. యయాతి కోర్కెపై విమోచనమును సూచించినాడు శుక్రుఁడు. ఇంతటితో దేవయాని ప్రస్తావన ముగిసినది. ఈ విషయమున దేవయానికిగెలుపో - ఓటమియో శ్రీకృష్ణద్వైపాయనులు నిరూపింపలేదు. ఇటు తరువాత శర్మిష్ఠపట్ల యామె ప్రవర్తనమును మనకుఁ దెలియదు. కాని యామెతత్త్వమునుబట్టి యూహించినచో శర్మిష్ఠపైఁ దనకుఁగల యాగ్రహమును — అనేకవిధముల వ్యక్తముచేసి—ఆమెను రాచి రంపానఁ బెట్టియుండును.

జయాపజయములలో నేది యీ పాత్రవిషయమున జరిగినది యనుప్రశ్నయు—సమాధానమును—అనవసరములు. ఏలన నసూయామయ మైన మనోవికారముతో దుఃఖమునకుఁ జాల్పడి—సుఖమునకు దూరమై—కేవలము మంకుదనముతో — క్షణక్షణము ప్రవృద్ధ మగుచున్నయుద్రేకముతో జీవితమును గడిపిన పాత్రకు జయాపజయములు పాఠకులే యూహించుకొనవచ్చును. దేవయాని యొక విధమైన వ్యక్తి. ఆమెకామెయే సాటి. ఆమెదొక విలక్షణ మైన స్థానము.

ఇట్టి పాత్రను సృష్టించుటవలన భారతమునసాధింపఁబడిన ప్రయోజనము కొంత తెలియవలయును. శుక్రునకు

నీమె ప్రాణముకంటె ప్రియమైన వస్తువగుటవలననే, దేవత లకు, దుస్సాధ్యమైన మృతసంజీవనిలభించినది. అనఁగా దేవ తల కార్యసాఫల్యమునకీమె యుపకరించినది. కాని దేవతల యుద్యమ మీమెను గష్టముల పాలొనరించినది. అసలామె యుద్రిక్తపాత్ర యగుటచేతనే దేవత లామెను నుపయో గించుకొనుట యుచిత మని తలఁచిరి. అనఁగా శుక్రునియొద్ద నామె యునికిదేవతలకు మేలు గూర్చిన దనుట. కచుఁ డామె కొసంఁగిన శాపమువలన బ్రాహ్మణుఁడు వివాహ మాడఁడు. కనుక దేవయానియయాతిని బరిణయ మాడినది. యయాతి క్షత్రియుఁడు కనుక వర్ణసంకర మేర్పడినట్లే, కాని శుక్రుఁడధర్మ నివృత్తికి వర మొసఁగినాఁడు. కాని వీరి సంతానమునకు వర్ణసంకరదోషము తప్పుట యెట్లు? వారు యయాతి యనంతరము రాజ్యమునకు వచ్చినచో రాజవం శమే ఘుందు వర్ణసంకరమునకు దారితీసినట్లు, ఆర్షసంప్ర దాయమున కది విరుద్ధము. ఇట్టి విరుద్ధము జరుగకుండ మునుముందు, దేవయాని యసూయామయమైన మనోవికా రము శర్మిష్ఠను లొంగఁదీసికొనినది. ఆమె రాచబిడ్డ, శర్మి ష్ఠను దాసిగాఁ జేసికొను సందర్భమునఁ గేవలము దేవ యాని యాభిజాత్యమే పనిచేసినది. దేవయానితోపాటు యయాతినగరమును బ్రవేశించిన శర్మిష్ఠకుఁ గొంతకాలము నకు యయాతివలన సంతానము కలిగినది. ఈ విషయము దెలియఁగనే దేవయాని యుడికిపోయినది. ప్రశాంతముగా నామె విషయమును బరిశీలించలేదు. తండ్రికడ కేఁగినది. అతఁడు యయాతిని శపించినాఁడు. మరల శాపవిమోచ

నము చెప్పుచు యయాతి ముసలితనమును స్వీకరించి, యౌవనము నొసఁగినవాఁడే రాజ్యమున కర్హుఁడగును. దేవయాని పుత్రు లందుల కంగీకరింపలేదు. శర్మిష్ఠ పుత్రుఁడైన పురు వంగీకరించినాఁడు. రాజ్యము వాని కైనది. కనుకవర్ణ సంకరము తప్పినది. దేవయాని పుత్రకుఁడొకఁడంగీకరించి నచో మార్పువచ్చెడిది. కాని తల్లి గుణగణములు సంతానమునందుఁ బ్రతిఫలించుట వింతగాదు. దేవయానివలెనె యామె సంతానమును బాహ్యాపరసంబంధ మైన యాలోచనకు దూరము.

# చిలకమర్తివారి గయోపాఖ్యానము

చిలకమర్తివారి మూడవ నాటకము గయోపాఖ్యానము. దీని రచనా కాలము 1889. వారి నాటకములలో కెల్ల అధిక ప్రచారము దీనికి గలదు.

ఈ కథ భారతమున లేదు. కల్పితము. దీనిని ప్రత్యేకముగా రచించినవారు 1, నాదెండ్ల గోపమంత్రి [ద్విపద] 2. వెలిచేరు వెంకటరామప్రధాని [పద్య] 3. రామనామాత్యుడు [పద్య] 4. కస్తూరి రంగకవి [పద్య] 5. వెల్లంటి సుబ్బయార్యుడు [పద్య] 6. ధేనువకొండ తిమ్మకవి [జంగంకథ]. సాధుపల్లి చంద్రశేఖరశాస్త్రి యనునతడు కన్నడమున దీనిని వ్రాసినట్లు వినుకలి. ఓబయామాత్యుడు, పోచిరాజు వీరన గూడ రచించిరి. *

"ఈ కథ కొంతవరకు మరుత్తరాట్చరిత్రము నందలి యొక కథను బోలియున్న" దని జయంతి రామయ్యగారు

* చూ. ఖరభారతి పుష్యము పుట. 55

ఆ కథను వ్రాసియున్నారు. [చూ. ఆధునికాంధ్రవాఙ్మయ వికాసవైఖరి. పుటలు 78, 79.] చిత్రభారతమున ఈ గయోపాఖ్యాన కథకు ఛాయ గలదు. మన్మథ సంవత్సరాది సంచిక – ఆంధ్రపత్రికలో దివాకర్ల వేంకటావధానిగారు "చిత్రభారతమున నిటువంటికథ యొకటి యున్నది. కాని దానికిని నాటక కథకును చాల భేదమున్నది. గయుడు కృష్ణుని చేతిలోగాక గాలవుడను నొక ఋషి చేతిలోనుమిసి యుండి నట్లును, అతడు కృష్ణునితో చెప్పుకొనగా కృష్ణుడు కుపితుడైన గయుని సంహరింప ప్రతిన చేసినట్లును, గయుడర్జునుని శరణు జొచ్చుటచే కృష్ణార్జునులకు యుద్ధము జరిగినట్లును అందు వర్ణింపబడి యున్నది* అని వ్రాసినారు. కాని చిత్రభారతముననున్న కథ యిదిగాదు. ఈ కథఅందు లేదు. అందున్న కథఇది. తుల్యుడనువాడు తపస్సు చేయుచుండెను. ఇంద్రుడు తపమునుభంగము చేయుటకు రంభనుపంపెను దానిని తుల్యుడు శపించెను. అశ్వమగునట్లుగా శపించెను. ఆ అశ్వము వేడుకొనెను. కుండిన నగరాధీశుడైన చతుర్ధనుడను రాజునకు వాహనమవై లోకములు చూపించి వచ్చిన తరువాత తొల్లింటి రూపము వచ్చునని యెనుముని. రంభ అశ్వమాయెను. కుండిననగరము చేరెను. రాజు దానినిజూచెను, అధిరోహించుట కుత్సుకడాయెను అధిరోహించెను. అది గగన మార్గమున కెగసెను. లోకములు తిరిగి కుండిన నగరమునకువచ్చుచుండిరి. యమునానదీ పులిన స్థలమున

* చూ. స్త్రీయచరిత్ర.పుట 72.

భానునిగూర్చి కృష్ణుడు అర్ఘ్యమిచ్చుచుండెను. ఆ సమయ ముననే ఆకసమునవచ్చుచున్న ఆ అశ్వముయొక్క ముఖఫేన కణము గాలికి జారి కృష్ణుని అంజలి యందున బడెను. కృష్ణుడు కోపించి పైకిచూచి, ఆ అశ్వముమీద పోవువానిని ముప్పది నాళ్ళలో చంపుదునని ప్రతిన చేసెను. చతుర్ధనుడు నగరముచేరి సుఖముగ నుండెను. నారదుడు వచ్చి కృష్ణుని విషయము చెప్పెను. దిక్కుతోచక చతుర్ధనుడు శాపమోక్ష వేళ రంభ తన కిచ్చిన నారాయణ మంత్రమును ఇంద్రుని గూర్చి పఠించెను. అతడు వచ్చెను. చతుర్ధనుడు విషయము చెప్పెను. ఇంద్రుడు వారించుట తన చేతగాదనెను. శంక రుని ప్రార్థించినాడు రాజు. అతడు గూడ ప్రత్యక్షమై ఇంద్రునిమాటయేచెప్పిపోయెను. అంతనాతడు బ్రహ్మనారా ధించెను. అతడువచ్చిగూడతనఅశక్తతనే వెలిబుచ్చెను. చతుర్ధ నుడు నిస్సహాయ స్థితిలో నుండెను. భిల్లుడొకడు వచ్చి "మన పొలముల కర్జునుడు మృగయ సమితితో నరుగు దెంచినవా" డని విన్నవించెను. రాజు కొంత ఆలోచించి "శౌరిపేరు నుడువక శరణు వేడెద"నని బయలుదేరి కిరీటికాళ్ళు పట్టు కొనెను. అర్జును డభయ మిచ్చెను. తరువాత అసలు విష యము తెలిసెను. అర్జునుడు విచారించెను. చతుర్ధనుని రక్షించు కొనుటకు నిర్ణయించు కొనెను. ధర్మరాజాదులు గూడ సరేయనిరి. హస్తినాపురమున యుద్ధ సన్నాహములు జరుగుచుండెను. కృష్ణుడు చారుల వలన ఈ విషయ మెరిగి అక్రూరుని బంపెను. అక్రూరుడు తిరిగివచ్చి విషయము

చెప్పెను. ధర్మరాజాదులు సహదేవుని కృష్ణుని యొద్దకు రాయబార మంపిరి. శాంతికి మార్గము లేకపోయెను. యుద్ధము నిశ్చయమాయెను. కురుక్షేత్రమున ఇరు బలము లును చేరెను. సంకుల సమర మాయెను. ధర్మరాజు తక్క మిగిలినవారందరును మడిసిరి. తరువాత కృష్ణుడు ధర్మజు ననునయించి అందరను బ్రతికించెను. అర్జునుని గౌరవించి చతుర్థుని మన్నించెను. ఇది చరిగొండ ధర్మన్న వ్రాసిన కథ. ఈ పురాణ గ్రంథము ఎనిమిదాశ్వాసములు. గాల వునివృత్తాంతమీగ్రంథమున లేదు. అదియెందున్నదో వ్రాయ వలసినదిగా దివాకర్ల వారినికోరుచున్నాను. గయోపాఖ్యాన కథకు ఇందు ఛాయగలదని నేను వ్రాసితిని. అశ్వమునకు బదులు గయుడన్న చో గయోపాఖ్యాన మగును. పరిశోధన సం. 1. సంచిక 5 లో బి. రామరాజుగారు "చరిగొండ ధర్మన్న వ్రాసిన చిత్రభారతమున నీకథాచ్ఛాయయున్నది. అది యూతగా నాదెండ్ల గోపమంత్రి శ్రీ కృష్ణార్జున సం వాదమను ద్విపద కావ్యమును వ్రాసెను" అని వ్రాసిరి. ఛాయ యున్నమాట సత్యమేగాని, చిత్రభారతమును నూత గాగొని గోపమంత్రి ద్విపద వ్రాసినాడనుట విచార్యము. గోపమంత్రి క్రీ. శ. 1525 ప్రాంతమువాడు. ధర్మన్న పదు నేడవ శతాబ్ది ప్రారంభమున నున్నవాడు. కనుక గోప మంత్రి ధర్మన్న గ్రంథము చూచి వ్రాయుట పొసగదు. ధర్మన్న ప్రథమాశ్వాసమున కథా ప్రారంభమునకుముందు బ్రహ్మాండ పురాణమును పేర్కొని యున్నాడు. బహుశః చతుర్థుని కథ అందున్నదేమొ? దానిని చూచి పేరు

మార్చి గోపమంత్రి రచించినాడేమొ ? ఇదియొక యూహ మాత్రమే. సప్రమాణమైనపుడే దీనికి విలువ. జయంతి రామయ్య పంతులుగారు 20 పుటల విమర్శ వ్రాయుచు గయోపాఖ్యానమును గూర్చి చిత్రభారతము పేరెత్తలేదు. అప్పటికి చిత్రభారతము మొదటి మారుగా అచ్చుపడినది. 1898 సం. న వీరేశలింగముగారు ప్రకటించిరి. రామయ్యగారి గ్రంథ రచన 1934 సంవత్సరమున. కానివారు గయోపాఖ్యానమునకు చిత్రభారతమునకు గల సంబంధము పసికట్టలేదు. మరుత్తరాట్చరిత్ర విషయమే చెప్పినారు.

ఇన్ని కథ లాధారముగాగొని లక్ష్మీనరసింహముగారీనాటకమును రచించిరి. చాల విషయముల ద్విపద గ్రంథమును, రామనామాత్యుని పద్య గ్రంథమును* ఆధారముగా చేసికొని ఈ నాటక రచన సాగినది. ఈ నాటకము నాధారముగా చేసికొని 1908 సం. న వల్లభనేని రామకృష్ణ కవియనునతడు వీధినాటకముగా గయోపాఖ్యానము రచించినాడు, అందు విశేషమేమియు లేదు.

రామనామాత్యుని గయోపాఖ్యాన కథ అంతయు గోపమంత్రి కృతివలెనే యున్నది. కొద్ది మార్పును గలదు. నాటకపరిశీలనమున వానిని పరామర్శింతును.

ఈ నాటకమున కథ రెండు దినములలో జరిగినది. తృతీయాంకాంతమువరకు నొక దినమున; తరువాతి రెండంకములు నొక దినమున. ఇతి వృత్తము పూర్వ గ్రంథముల

---

* చూ. స్వీయచరిత్ర పుట, 72

నుండి స్వీకరించబడినను కొన్ని మార్పులు గలవు. అవి నాటక కర్త చేసినవి. అందువలన ఔచిత్య నిర్వహణము జరిగినది. దాని వలన నాటకమునకు రామణీయకము వచ్చినది. పూర్వ కృతులలో ద్వారకానగర సమీపస్థ కాసారమున కృష్ణుడు అర్ఘ్య మిచ్చుచున్నట్లున్నది. నాటకమున బృందావన తీరమున కాళిందిలో కృష్ణుడున్నట్లున్నది. చిత్రభారతమునను యమునా నదీపులిన స్థలమున అర్ఘ్య మిచ్చుచున్నట్లున్నది. నాటకము నందలిఈమార్పున కొక ఔచితిని రామయ్య పంతులుగా రూహించిరి. "ఉత్తర రామచరితము నందువలెఁ బూర్వ పరిచిత ప్రదేశములం జూచునప్పుడు గలుగు భావముల వర్ణించుటకనువై యుండు నని లక్ష్మీనరసింహముగా రీమార్పును చేసియుందురు." ఇది సమంజసముగనే యున్నది. నిష్ఠీవన మొనరించిన వాని కొరకు గగనమంతయు వెదకి, వాని పొడగానలేక విస్మయ మందియున్న సమయమున కృష్ణునకు జలదేవత గయుని వృత్తాంతము చెప్పినట్లు వెనుకటి రెండు గ్రంథములందునున్నది. కృష్ణుడు వ్యర్థ ప్రయత్నుడుగను, జలదేవత గాంభీర్యము లేనిదిగను, పై వాక్యము వలనద్యోతకమగుచున్నది. ఈ సన్నివేశము ఇరువుర విషయమునను తక్కువదనమునే నిరూపించుచున్నది. కనుక నాటకమున మునుముందు నిష్ఠీవన మొనరించిన ఖలుని సంహరింపక మాన నని శపథముచేసి కృష్ణుడు, ఆగ్రహాయత్త చిత్తుడై 'ఎవరాతడు ?" అని ప్రశ్నించినట్లు మార్చబడినది. ఇందు నిజమునకు కృష్ణుడు నిష్ఠీవన మొనరించిన వాని

కొరకు వెతక లేదు. వ్యర్థ ప్రయత్నుడు కాను లేదు. తన నడిగిన యనంతరమే సమాధానము చెప్పుట వలన జలదేవత గాంభీర్యము నిలుపబడినది. కనుక నాటకమునందలి యీ మార్పు శిల్పానుగుణమై యుచితముగా నున్నది. ఏమియు నెరుగక మహావేగమున పోవు గయునకు, తాను స్వయముగ కల్పించుకొని ఆకాశవాణి శ్రీకృష్ణుని ప్రతిన చెప్పి, కమలాసనుని శరణు వేడుకొనుమని చెప్పినట్లుగోపన మంత్రియు, రామనయు వ్రాసిరి. ఇది సమంజసముగ లేదు. గయుడు బ్రహ్మలోకమునుండి తిరిగి వచ్చి మణిపురమున, సభార్యుడై పుష్పదంతునితో సంభాషించుచు వైరాగ్య చిత్తుడై "మరణ మెపుడైన నున్నదె మనకు నెల్ల" అని యనగానే గగనవాణి "నిజము గంధర్వా" అని శ్రీకృష్ణుని ప్రతిన చెప్పినట్లు నాటకమున మార్చబడినది. ఇందును కొంత లోపము లేకపోలేదుగాని పూర్వకృతులకంటె మేలని మాత్రము చెప్పవచ్చును. పూర్వకృతులు రెండింటిలోను శ్రీకృష్ణుడు అర్జునుని యొద్దకు గరుడుని రాయబార మంపినట్లున్నది. నాటకమున పక్షిరాయబార మెందులకని కాబోలు తీసివేయబడినది. ఈ తీసివేయుటలో ప్రదర్శన యోగ్యత యను విషయము నాటకకర్తదృష్టిలో నున్నది. వేగవంతుని రాయబారము తరువాత వరుసగా అక్రూరుని, సుభద్రను పంపినట్లు పూర్వులిరువురును వ్రాసిరి. ఇన్ని రాయబారములును సాధించిన ప్రయోజనమేదియును లేదు. కనుక నాటకమున వేగవంతుని తొలగించి అక్రూరుని, సుభద్రనునొకేమారు శ్రీకృష్ణుడు రాయబారమంపినట్లుగామార్చ

బడినది. ఒకకార్యమును సాధించుటకునొకరితరువాతనొకరు పోవుటలోకంటెనిరువురుననొకసారిపోవుటలోవిశేషమున్నది అది సులభసాధ్య మగుట కవకాశముండుటయే ఆ విశేషము. యుక్తియుక్తమైన నాటకమందలి ఈ మార్పు శక్తిమంతమే గాక రక్తిమంతము గూడను. నాటకమున కార్యము సాధించ బడలేదు గనుక కాలము కొంత కలసి వచ్చినది.

పూర్వకృతులందు నారదుడు హస్తినాపురికరిగి, కృష్ణార్జునుల వైరవిషయము ధార్తరాష్ట్రులకు తెలిపినట్లును, అందుమూలమున దుర్యోధనుడు, ముందుశ్రీకృష్ణుని సంహరించినచో, తరువాత పాండవుల నతిసులభముగా హతమార్చ వచ్చునని తలచి, ససైన్యుడై, పాండవుల పక్షమున యుద్ధము చేయుటకు ద్వైతవనమునకు వచ్చినట్లును వ్రాయబడి యున్నది. ఇది కేవలము అవాంతర విషయమగుట నాటకకర్త ఈ విషయమును సూక్ష్మముగ సూచించి వదలెను. పై విషయమునకు ప్రాధాన్య మిచ్చినచో రూపకేతివృత్తగమన మాగును. ఆగరాదు, ఆపరాదు కనుకనే చిలకమర్తి అట్లు చేసెను. నాదెండ్లవారి ద్రుపదలోనీశ్వరుడు తననుగయుడు శరణు చొచ్చినపుడు "చేకొనికృష్ణుడు చేసిన ప్రతిన, నాకుఁదీర్పగఁబూన న్యాయంబుగాదు" అని కృష్ణార్జునుల యుద్ధసందర్భమున ప్రత్యక్షమై "నీవననేనన నేది భేదంబు, నాకును,నీకును, నరుడొక్కరూపు" అనిశ్రీకృష్ణునితో చెప్పి "గంధర్వ, నిన్ను నే గాచితి నమ్ము" అని గయునితో చెప్పినట్లున్నది. గయుడు పాదముల మీద బడి

వేడుకొనినపుడు చేయుటకు న్యాయముగాని పని యుద్ధము వచ్చినపుడు చేయుటకు న్యాయముగా అది ఎట్లు మార గలదు ? మారలేదు - ఈ లోపమున్నది ద్విపద గ్రంథ మున. రామనామాత్యుఁడు దీనిని కొంత మార్చినాడు. "ఏమి సేయువాడ నితనినెవ్విధిఁగాతు" అనిమనమున వితర్కించు కొని శంకరుడు "ఆ యదువంశ శేఖరుని యద్భుతమైన ప్రతిజ్ఞ మాన్పగా, న్యాయముగాదు నాకు" అని గయునితో చెప్పినాడు. ఇది గోపనమంత్రి వ్రాసిన విధమే. పోరు ఘోరమైన సమయమున శివుడువచ్చి "నీవు నేనను భేదంబు నెన్నలేదు, సమము మనకెంచి చూడగ సవ్యసాచి" అని శ్రీకృష్ణునితో చెప్పి, అర్జునిజూచి "వారిజనాభుడు మేమును శూరుఁడవని మెచ్చినాము సురపతి తనయా, కోరిన వర మడుగుము" అనినాడు. అర్జునుడు "గయునిగాచుట వర మింతె గరళకంఠ" యనినాడు. అంతనీశ్వరుండు పార్థు నితో హరిని శరణము కోరుమనినాడు, అర్జునుడట్లు చేసి నాడు. "నమ్మి గయ! నిన్నుగాచితి నరునిఁ చూచి" అని నాడు శ్రీకృష్ణుడు. ఇది రామనామాత్యుని మార్పు. నా రెండ్లవారి దానికంటె యిది మేలు. దీని కంటెను నాటక మున చేయబడిన మార్పు మేలుతరము. నరనారాయణుల యుద్ధమువలన జగత్సంక్షోభము వాటిల్లినది. దానిని ఈశ్వ రుఁడు వారించ వలయునుగాన ప్రత్యక్షమైనాడు. యుద్ధము నకు సిద్ధపడిన వారియందును, హేతుభూతుడైన వానియం దును తప్పులున్నవి, వానిని ఈశ్వరుడే చెప్పగలడు. నిర్ల క్ష్యముగా నిష్టీవన మొనరించుట గయునితప్పు. ఉద్దేశ

పూర్వకముగాని స్వల్పదోషమున కంత తీవ్రమైన ప్రతిన బూనుట శ్రీకృష్ణుని తప్పు. విషయ విచారము లేకుండ అభయ మొసగుట అర్జునుని తప్పు. కనుక సంధిచేసికొనుట యుత్తమ పక్షము. ఇంతతో నాటకము ముగిసినను శ్రీకృష్ణుని ప్రతినచెల్లలేదు. శ్రీకృష్ణునకు ప్రతిజ్ఞాభంగము గలుగరాదు. ఆ ప్రతినవిషయమై శంకరుడు ఉక్తి చమత్కృతి నుపయోగించినాడు. స్వాయంభువుడైన శ్రీకృష్ణుడు నిజమునకు దేవకీ వసుదేవుల తనయుడు గాడు. "అద్దురాత్ము వధియింపకపోవుదునేని దేవకీదేవికిపుణ్యమూర్తి వసుదేవునకున్ తనయుండగానికన్" అని శ్రీకృష్ణుని ప్రతిన. గయునివధియించినను వధించక పోయినను గూడ దేవకీ వసుదేవుల కతడు కుమారుడుగాడు. అట్టిచో వధించవలసిన యవసరమేమున్నది? ఇది శంకరుని వాదము. శ్రీకృష్ణు డంగీకరించినాడు. ఇది నాటకోచితమై- అనౌచిత్యము పొంతబోక మనోహరముగ నున్నది. పూర్వ కృతులయందలిఅనౌచిత్యములను సూక్ష్మదృష్టిని పరిశీలించి పరిహరించి, నాటక రూపమున ప్రాతకథనే పోతపోసినాడు చిలకమర్తి.

గీర్వాణ రూపకమర్యాద ననుసరించి ఈ నాటకమునందలి నాయకుడు ధీరోదాత్తుడు. ప్రఖ్యాతుడు. ఈ నాటకమున శ్రీకృష్ణుని దృఢవ్రతత్వము నిరూపించబడినది. అంగిరసము వీరమగుటచేత నా విషయ నిరూపణ మావశ్యకమైనది. శ్రీకృష్ణుని దృఢవ్రత ప్రవచనమునకు కల్పించబడిన హేతువు స్వల్పమైనది. అనగా దానికిది హేతువగుటకు శక్తముగాదు. ఈ లోపము మూలకథలోనే

యున్నది. మార్చుటకు నాటకకర్త కవకాశము లేదు. దీనిని వదలినచో మిగిలిన నాటకేతివృత్తము నిబిడబంధముగలదై యున్నది. ప్రథమాంకమున నాయకుని పూనికయు, ద్వితీయమున గయుని ఆరాటమును, తృతీయమున ప్రతి నాయకుని ఆవిర్భావమును, చతుర్థాంకమున నాయకుని పూనిక నుప సంహరించు ప్రయత్నమును, పంచమమున యుద్ధమును తత్ఫలితమును - ఒక క్రమమున ననుసరించి నిరూపించబడినవి. సామాజికులకు జరుగబోవు విషయము తెలియనీకుండ అనుమాన చిత్తప్రవృత్తిని కలుగజేసి, హఠాత్పరిణామమును చూపించుచు నాటకము రక్తిగట్టునట్లు నిర్వహించబడినది. ప్రథమాంకమున నాయకుని "ఇంక నాఖలు గయుని త్తమాంగమును ఖండన చేసెద చక్రధారలన్" అను వాక్యమును "ఈ విధినద్దురాత్ము వధియింపకపోవుదునేని దేవకీ దేవికి పుణ్యమూర్తి వసుదేవునకున్ తనయుండ గానికన్" అను ప్రతినయు సామాజికులకు తత్తరపాటు కలిగించును. యమునానదిని, బృందావనమును దర్శించుటకు వచ్చుటలోని శ్రీకృష్ణుని యుద్దేశ మొకటి. అటకు చేరిన తరువాత అర్ఘ్యము విడుచుసమయమున జరిగినదింకొకటి. దానికి ప్రతీకారము చేయుటకు కృష్ణుడు చేసినది ఘోరమైన ప్రతిన. ఇది యెట్లు నెరవేరునో అను విషయమున ప్రేక్షకుల హృదయములు సందేహడోలలో నూగును. గయుని గతికి అయ్యో పాపమని ఒక నిట్టూర్పువిడచును. సృష్టించవలసిన వైచిత్రిని నాటకకర్త సృష్టించినాడు. ద్వితీయాంక

మున గయుడు తన ప్రాణమును రక్షించుకొనుటకు ప్రయత్నముచేయును. ఆ ప్రయత్నమున నతడు దర్శించిన ప్రతివారును నభయము చెప్పగలవారని సామాజికులు తలపోయుచుండగా నందుకు భిన్నముగ సన్నివేశము నిర్వహించబడుటయు, ప్రేక్షకులూహింపని ప్రతి నాయకుడు నారదునిచేత సూచించబడుటయు, సామాజికుల నద్భుతాయత్తచిత్తులను చేయుచున్నది. తృతీయాంకమున నర్జునుడు "ఈ ప్రభాకర నిశాకరాదిగ్రహంబులు, భూమ్యాకాశాది పంచభూతములు సాక్షులుగా నీ కభయదానము చేసితి" ననియు "ఎవరు వచ్చి నిన్ను విడువమన్న విడువ"నని గయునితో చెప్పుట. సామాజికులకు ముందు జరుగబోవు విషయము నూహించు శక్తిని మభ్యపరచి స్తబ్ధులను గావించును. నాయక ప్రతి నాయకు లిరువురును కావలసినవారు. జీవికా జీవులవంటి వారు. పరస్పర విరుద్ధముగ భయంకరములైన ప్రతినలు చేసిరి. ఇరువురును ప్రతిజ్ఞాపాలనము చేయుటయందు నిశ్చయము గలవారే. ఇక కథనడుచు విధమేది ? ఎవరు నెగుదురు ? ఏమగును గయుడు ? వీనిమూలమున రాగూడని వారికి వైరము వచ్చినది. అది ఎట్లు పరిణమించునో ? సామాజికులలో నింత భావసంఘర్షణము కలుగజేసి తృతీయాంకము స్థాయినందుకొనినది. చతుర్థాంకమున అక్రూరాదుల రాయబార ప్రయత్నమునుచూచి అర్జునుడొకవేళ కృష్ణుని మాటల నాలకించునేమోనని సామాజికులూహించుచుండ తద్విరుద్ధముగ పార్థుడు నిరాకరించుట అద్భుతావహమగుచున్నది. యుద్ధము తప్పనిసరియైనది. దేవకీదేవి,

సత్య, రుక్మిణి మొదలైన వారి యుద్ధవిరమణ ప్రయత్నములు వ్యర్థమగుటతో కృష్ణార్జునులకు పోరు నిశ్చయమైనది. కాని సామాజికులు దాని పర్యవసానము నూహించలేరు. పంచమాంకమున యుద్ధసమయమున శంకరుడు ప్రత్యక్షమై వారిని వారించి శ్రీకృష్ణునిచేతనే గయుని రక్షింపజేయుట, శ్రీకృష్ణుని ప్రతినను చమత్కారముగ సమర్థించుట, ఆనంద ప్రతిపాదకమగు నుపసంహారమై సామాజిక మనోరంజకమైనది. నాటకమును క్రమోన్మీలనమును చేయుటలో చిలకమర్తి ఇతివృత్తమును చక్కగా దిద్దుకొనినాడు.

ఇతివృత్తమును నెంత చక్కగ దిద్దుకొనినను తన పాత్రములచేత దానిని నిర్వహింప జేయలేనిచో కవి అశక్తత బయట పడును. చిలకమర్తి ఈ విషయమునను చాల వరకు కృతకృత్యుడు కాలేదు. కాని గుణములు లేక పోలేదు. ఈ విషయములను నాటకపాత్ర సృష్టిలో లీనమొనరించి విమర్శించెదను. నాటకములందు పాత్ర చిత్రణమునకే అవకాశమున్నదిగాని వర్ణనకులేదు. ఈ చిత్రణము స్థూలముగ మూడు విధములు. [1] పాత్ర వాచికము, [2] పాత్ర చేత, [3] ఒక పాత్రను గూర్చి మరొక పాత్రి భావము. అనగా పాత్రగతమైన వాచికము నందలి యుదాత్తత వలనను, ఆయా సన్నివేశములలో స్వభావాను గుణముగ ఆ పాత్రచేయు చేష్టల వలనను, ఆ పాత్రను గూర్చి మరొక పాత్ర చెప్పిన అభిప్రాయము వలనను, అపాత్ర చిత్రణము జరుగును. ఇది నాటకీయ శిల్పమున అంతర్భా

గము. ఈ నాటకమున ప్రధాన పాత్రలైన కృష్ణార్జునులు ప్రసిద్ధులు. అనగా వారి పాత్ర వర్ణనముగాని, చిత్రణము గాని వెనుకనే చేయబడి యున్నది. మహర్షులే ఆపని చేసిరి. ఆ దృష్టితో చూచినపుడు చిలకమర్తి ఆగజాలడు. కాని వారు మనకు పూర్వపరిచితులైన కృష్ణార్జునులు కారని చూడవలయును. ఎట్లు చూచినను వారు కాకపోరు. కృష్ణార్జునులకు యుద్ధము ప్రారంభమగు వరకును ఆ రెండు పాత్రములను సహజముగ నుదాత్తతను కోలుపోలేదని చెప్పవచ్చును. ప్రథమాంకమున తన బాల్య క్రీడలను కృష్ణుడే వర్ణించి చెప్పును. అందు కొన్ని ముఖ్యముగా విన వలసినవని చెప్పును. ఇది అంత సమంజసముగ లేదు. నిష్ఠీవనము పడగానే యుగ్రుడై పలికిన భావము వీరోచితముగా నున్నది. ఇది ఎంత వీరోచితముగా నున్నదో "ప్రతిన బాలింతు లోకముల్ ప్రస్తుతింప" అనుట అంత పేలవముగా నున్నది. చతుర్థాంకమున ద్వైతవనమునకు పోయి తిరిగి వచ్చిన అక్రూరుని, ధర్మరాజాదుల క్షేమ సమాచారము లడుగుటలోని కృష్ణుని ఔత్సుక్యము వాని బంధుప్రేమను వెల్లడి చేయుచున్నది. అక్రూరుడు పార్థుని నిశ్చయము చెప్పిన వెనువెంటనే మామూలు మానవునివలె క్రుద్ధుడై తాను చేసిన మేలు చేతలను స్మరించుకొనుట, ఆ విషయ మును విని ఖిన్నయైన సుభద్రతో విరసోక్తులాడుట, సామము చెప్పవచ్చిన రుక్మిణీ, సత్యభామలతో కటువుగా మాటాడుట శ్రీకృష్ణుని అధఃపతితునిగా చేసినవి. కృష్ణుని యుదాత్తత అంతయు భగ్నమైనది. యుద్ధ సమయమున

కృష్ణార్జునుల వాగ్వాదము ఆ పాత్రముల పతనావస్థను సూచించుచున్నది. ఇతివృత్తమును నంత నిబిడముగా నేర్పాటు చేసికొనినవాడు నిర్వహణమున ఇట్లు పాడు చేయుట యేలన నాటకకర్తకు పాత్ర సృష్టి విషయమున దృష్టిలేదు. సుభద్రతో అర్జునుని సంభాషణ కూడ చాల తక్కువ స్థాయిలో నున్నది. ధీరోదాత్తులైన కృష్ణార్జునులు సామాన్య మానవులవలె నున్నారు నాటకమున. ఇక గయుడు: అతడార్తుడు. ప్రాణము కాపాడుకొన వలయు నన్న వాంఛయే అతనిది. అతని దీనాలాపములు కరుణ ప్రధానములు. మణిపురాధీశ్వరుడని చెప్పుట మూలమున తెలియుటయేగాని, ఆ అధీశ్వరత్వము వాని నరమునకు పట్ట లేదు. చిత్ర భారతమునందలి చతుర్థనుడు చాల నయము. అర్జునుని శరణు వేడినను చతురంగ బలములతో కూడి హస్తినా పట్టణమునకు వచ్చినాడు. అర్జునుడు సహాయ మున్నను తాను గూడ తన బలముతో కృష్ణునితో పోరు టకు వచ్చినాడు. అది ఒక నగరమునకు అధీశ్వరత్వము గలవాని లక్షణము. అది గయునిలో లేదు. మిగిలివారు సామాన్యముగనే యున్నారు? శ్రీకృష్ణుని వేడుక చెలికాడు బహు అసందర్భమైన వ్యక్తి. ఇటువంటి విదూషకపాత్రను నాటకములందు ప్రవేశపెట్టుట గీర్వాణమునను, ఆంగ్లము నను గూడ గలదు. ఈ రెండింటికిని కొద్దిభేద మున్నది. నాటకమున ప్రవేశించిన పాత్ర ఒక పరమ ప్రయోజనమును సాధించ వలయును. అది లేనిచో ఆపాత్ర ప్రవేశ మనవ సరము. హాస్యసాధన మనునది నాటక పరమ ప్రయోజ

నము గాదు. విదూషకుడు హాస్యముతో బాటు నాటకేతి వృత్తమునకు సంబంధించిన మరొక ప్రయోజనమును సాధించవలెను. స్వప్నవాసవదత్తమందలి విదూషకు డట్టి వాడు. మాళవికాగ్నిమిత్రమునందలి గౌతము డట్టివాడు. వసంతకుడు లేనిచో భాసనాటకమునకు పుష్టి యుండెడిది గాదు. గౌతముడు లేనిచో కాళిదాసుని రూపకముండి యుండెడిదిగాదు. పాత్రములనగా అట్లుండవలయును. గయో పాఖ్యానము నందలి విదూషకుడు కేవల మప్రయోజకుడు. హాస్యసాధకు డగుటయే వాని ప్రయోజన మందురా? అది యుదాత్తముగాదు. సహృదయ హృదయంగమము గాదు. రుక్మిణి; సత్య, దేవకీదేవి ఒకరి తరువాత నొకరు వచ్చి కృష్ణుని అర్జునునితో సంధి గావించుకొమ్మని ప్రార్థించుట కొంత పునరుక్తి దోషమునకు గురియగుచున్నదను దివాకర్ల వారి యభిప్రాయము సవిమర్శకము వసుదేవుని ప్రసక్తి లేదు. పునరుక్తి యటులుండ ప్రధాన కథాగతి కుంటువడినదీ సందర్భమున, సన్నివేశమంత యసందర్భముగా నున్నను ప్రవేశించిన పాత్రములు తమయుదాత్తతనునిలుపుకొనినవా యనిన అదియును లేదు. ఈ స్త్రీ జనమంతయు మగవారిని నమ్మరాదను విషయమున నేక కంఠులు. వీరి కా సందర్భమున సమాధాన మిచ్చిన కృష్ణుడతి కఠినుడు. ఒకరి కొకరు తీసిపోలేదు. పంచమాంకమున యుద్ధానంతరము శ్రీకృష్ణుడు చదువు "కుటిలా చారులు" అను పద్యముతో నాటకమంతయు చెడిపోయినది. ధార్తరాష్ట్రులను గెలుచుటకుతగినపటు శస్త్రములుపాండవులు సంపాదించిరోలేదోఅని తెలుసుకొన

గోరియుద్ధము చేసినాడట కృష్ణుడు. ఇంతకంటె అసందర్భమైన వాక్యము ఈ నాటకమున మరియొకటిలేదు. నాటక ప్రాణమునే హరించినది. పాలే సీళ్ళుగానున్న వనుకొనుచుండ విషబిందు వందుబడినట్లున్నది. అమృతపు మెరుపుగలఇతివృత్తమును పాత్రముల విపలిప్త హస్తములు పోతబోసినవి. పాత్రముల విషయమున నాటకకర్త కొంచెము జాగ్రత్త వహించి యుండియున్నచో ఈ గయోపాఖ్యాన ముత్తమ నాటక మయ్యేడిది. ప్రస్తుతమీ నాటకమున యుదాత్తత లేకపోవుటయే పెద్దలోపము. లక్షప్రతులు ఆంధ్రదేశమున నమ్ముడు బోవుట నాటకము యొక్క గొప్పతనమును బట్టి గాదు. అది నాటకములేని కాలమగుటనుబట్టి. నేటికినిజనాదరణ పాత్రమయియే యున్నదిగదా యనిన, ఆ నాటకమును ఆదరించుటకు, ఆనందించుటకు మాత్రమే తగిన సంస్కారము జనతలో నున్నదన్నమాట. జనసామాన్యము యొక్క ఆదరాభిమానములను బట్టి వాఙ్మయ గ్రంథముల శ్రేష్ఠత్వమును నిర్ణయించరాదు. మనదేశమింకను ఆస్థితికి రాలేదు గనుక నిర్ణయించరాదు.

ఇక శైలివిషయముకొద్దిగా వ్రాయుదును. బ్రహ్మపదార్థమువంటి ఆ విషయమును చర్చించుట ఇట అప్రస్తుతము. చిలకమర్తి శైలిగురించి కురుగంటి సీతారామయ్యగారు "నవ్యాంధ్ర సాహిత్య వీధులు" పుట 42 లో "వీరిశైలి చక్కని వైదర్భి రీతిగలది. అప్రయత్నలబ్ధమై రసవంతముగా వుంటుంది. ఈయన సీసపద్యాలు శ్రీనాథునిపాటల్లే చాలా వరకూ సమత కలిగి రసవంతంగా వుంటై. వీరేశ లింగం

గారి శైలల్లే వీరిదిగూడా సౌలభ్యంతో గూడివుంటుంది." అని వ్రాసినారు. ఈ యభిప్రాయము చాలవరకు సత్యదూరము కాదు. నాటకమున శైలినిగూర్చి చర్చించునపుడు వచనము, పద్యము అను రెండు విషయములను దృష్టిలో నుంచుకొనవలయును. శాంతమైన మనఃప్రవృత్తిని, వివరణాత్మకమైన భావమును వ్యక్తీకరించవలసి వచ్చినపుడు నాటకమున వచనము వాడవలయును. అందుకది శక్తము. ఆ వేగముగల మనః ప్రవృత్తిని ఉదాత్తమైన భావమును వ్యక్తీకరించవలసి వచ్చినపుడు పద్యమును వ్రాయవలయును. ఇట్లన్నందున ప్రతిచోట ఒకే పద్యమును వ్రాయరాదు. అనగా ఒకే ఛందమును వృత్తౌచిత్యమును పాటించుట ఒక శిల్పధర్మము. సంస్కృత వాఙ్మయ కర్తలు దృశ్య కావ్యముల విషయమున నీ దృష్టి కలిగి యుండిరి. శ్రవ్యకావ్యముల విషయమునచాల మంది శ్రద్ధవహింపలేదు. రెండింటిలోను ఇది యవసరమే. దృశ్యకావ్యములందు ముఖ్యము. రసానుగుణమైన రాగమువలనే వృత్తము గూడ నుండవలయును. సువృత్త తిలకమను గ్రంథమున క్షేమేంద్రుడీ వృత్తౌచిత్యమును చర్చించెను.

"కావ్యే రసానుసారేణ వర్ణనానుగుణే నచ
కుర్వీతసర్వవృత్తానాం వినియోగం విభాగవిత్
సువర్ణార్హప్రబంధేషు యథా స్థాననివేశినామ్
రత్నానా మివ వృత్తానాం భవత్యభ్యధికా రుచిః"

అని అతని అభిప్రాయము. రసానుగుణముగను, వర్ణనానుగుణముగను వృత్తమును వ్రాయవలయును. ఉచిత ఘట్టమున నుచిత వృత్తమును వాడవలయును. అపుడుదాని రుచి యుండును.

గయోపాఖ్యాననాటకమున, నాందీ భరత వాక్యములతో కలుపుకొని 208 పద్యములున్నవి. ఇన్ని పద్యములు పాడుటకు రాక్షసశక్తిగల నటకులు గావలెనని కొందరన వచ్చును. నేడది యమానుషమనిగూడ అనవచ్చును. అనగా నేటి మానవుడు కేవల మల్పశక్తుడు, అసమర్థుడు, అని మరికొందరనవచ్చును. ఎవరేమన్నను ఈ నాటకమున 208 పద్యములున్నవి. ఇవన్నియు, నాటకమున కుచితముగా నున్నవా ? లేవా ? అనునదే మనకు సంబంధించిన ప్రశ్న. ఇందు కవిరాజ విరాజితము 3. లయగ్రాహి 1. ఉత్సాహ 1. మాలిక. 2. పద్యములు మహాస్రగ్ధర 1. మిగిలినవి సామాన్య వృత్తములు. ఈ వృత్తౌచిత్యమును విమర్శించునపుడు "శ్రీకృష్ణుని పాత్రము ధరించుటకై యుద్దేశింపబడిన వారు పద్యములు చదువగలవారగుటచేనేనా పాత్రమునకు పద్యములు వ్రాసితిని" * అను చిలకమర్తి వారి అభిప్రాయ రహస్యమును గ్రహించ వలయును. నాటకావసరమును బట్టికాక నటకులనుబట్టి పద్య రచనచేసినాడట. ఇందువలన నుచితముగాని పలుచోట్ల పద్యములు వ్రాయబడినట్లు స్పష్టము. శిల్పదృష్టికి ఇదియొక లోపము.

* చూ. స్వీయచరిత్ర పుట. 72

చిలకమర్తి యీ లోపమును గమనించినాడు. కాని నట
కులనుబట్టి వ్రాయవలసి వచ్చిన దినములవ్వి. కనుకనే వారి
నాటకములలో అస్థానపతితములైన పద్యములు గలవు. ఈ
నాటకమున సముచితస్థానమున వ్రాయబడినఉచితవృత్తము
లను గమనించిన చాలును. మునుముందు విశేషవృత్తము
లుచితస్థానమున నున్నవేమో పరిశీలించ వలయును. మొదటి
కవిరాజవిరాజితము ప్రస్తావనలోనిది. వసంతమును గూర్చినటి
పాడినది. గానానుగుణమైన ఆరోహావరోహణములా ఛం
దమున నున్నవిఒకవేమునుఆఛందముననున్నది. కనుక "నవ
నవ మంజు కిసాలయ పుంజము...." అను పద్య ముచిత
స్థలముననే యున్నది. నాటక మాడుటయందు సూత్రధా
రున కెంత యౌత్సుక్య మున్నదో నటికిని అంతయున్నది.
తదౌత్సుక్యాను గుణముగను ఆ పద్యమున్నది. మిగిలిన
రెండును యుద్ధప్రారంభమున కృష్ణార్జునులు చదివినవి.
పంచమాంకమునందలి యీ పద్యద్వయము వీరోచితముగా
లేవు. అర్జునుని బెదరించుట కృష్ణుని యుద్దేశ్యము. తన
నిశ్చయమును విడనాడనని చెప్పుట పార్థుని యుద్దేశము.
యుద్ధసమయ మాసన్నమైనది గనుక ఇరువురకును ఆవేగ
మున్నది. దానిని మాత్రమే ఆ పద్యములు వ్యక్తీకరించును
అంతవరకే అట పాని యౌచిత్యము, ఉత్సాహమాలిక
ప్రథమాంకమున కౌశికుని సూర్యస్తవ ఘట్టమున వ్రాయబడి
నది. ఆ విధూషకుడు నిరంతర ముత్సాహియే. అతని భావ
ములును కొంటెకోనంగి భావములే. అట్టి యుత్సాహము,
అట్టి భావములు గలవాని నోటినుండి ఆ మాలికను పలి

క్షించుటఅత్యంతసముచితముగానున్నది.పాత్రకు తగినభావము భావమునకు తగినఛందముఅటనిరూపించబడినది.మహాస్రగ్ధర పంచమాంకముననున్నది. దుర్యోధనుడు ససైన్యుడై వచ్చుచున్నాడని భటుడెరింగించిన . వెంటనే క్రుద్ధుడై భీముడు, శ్రీకృష్ణునితో కలసితమ్ము వధింపవచ్చుచున్నాడని తలచి ముందు దుర్యోధనాదులను చంప నుద్యుక్తుడగును. ఆ ఘట్టమున భీముని నోట ఆ మహాస్రగ్ధరావృత్తమును పలికించినాడుచిలకమర్తి. స్రగ్ధరవీరమున కుచితమైనదే. ఛందము నకుతోడు భాషగూడ తగినట్లుండవలయును. ఇట పటిష్ఠమును, పరుషమును ఐన శబ్దజాలము నుపయోగించవలయును. చిలకమర్తి ఆ పని చేయలేదు. సౌప్తికపర్వమున జరిగిన ఆ ప్రళయ సందర్భమున తిక్కన మహాస్రగ్ధరలు వ్రాసినాడు.అవి పటిష్ఠములును, పరుషములును. ఈనాటకమున లయగ్రాహి యొక్కడున్నదంటిని. ప్రథమాశ్వాసమున ప్రవేశించిన శ్రీకృష్ణుడు బృందావన రామణీయకమును వర్ణించు పద్యమది. వసంతర్తు వలెనున్నది సమయము. సమయోచితముగనే యున్నది. ఆదిపర్వమునచేసినవసంత వర్ణన సందర్భమున నన్నయ లయగ్రాహివృత్తములనే వాడెను. ఇవిగాక నాటకమున సన్నివేశానుగుణముగనున్న పద్యములు కొన్నిగలవు. వీని నన్నింటిని వివరించుట యనవసరము. ప్రథమాంకము, 1. "జలనిధులింకుగాక." 2. "ఈ విధినద్దురాత్ము." ద్వితీయాంకము 1, "మందిరములు విజ్ఞానమయములచట." 2. "బలి యొగ్గమొనరించె" 3. చెలివై చుట్టమవై. 4. "నా మనోహరు గాచి నన్ను రక్షింపరే."

తృతీయాంకమున 1. "నిటలాక్షుం డిపు డెత్తి వచ్చినను." 2. "నలినగర్భునికన్న నారాయణుడు తాను." చతుర్థాంకమున. 1. ఉన్నాడా గయుడిప్డు" 2. "కలనైనం దలపోయలేదు." పంచమాంకమున 1. "తొలుదొల్తన్ రాజరాజు" 2. నేనే శ్రీహరివంశ సంభవుడనేనీ" 3. "నేనేసర్వజగన్నియామక" 4. "పాడియు పంటయు గలిగి" ఇట్టివిమరికొన్నియుండవచ్చును. ఎట్లైనను అస్థాన పతితములైన పద్యములు చాలయున్నవి, వానివలన నాటకమునకు గౌరవవిషయమున లఘుత్వమే వచ్చినది. ఈ నాటకమునందలి పద్యములందు ప్రసన్నతయున్నది. గాంభీర్యము లేదు. భావుకతయుతక్కువ. ఉన్న పద్యములున్నను అవి పూర్వ కృతులనుండి గ్రహింపబడినవే. కురుగంటివారు చెప్పినట్లు ఈ నాటకమున నున్న పద్యశైలి వైదర్భీరీతి గలదియే. ఈ నాటకమునందలివచన శైలియు అరీతికి సంబంధించినదే. దీర్ఘమైన వాక్యరచన, ప్రామాణిక గ్రాంథిక రచన నేడు కొందరకు క్లిష్టముగానుండవచ్చును. ఐనను ఆ వచనము సార్వత్రికముగానొక చమత్కారమును నిముడ్చుకొనినదిగాని, ఉదాత్తత పొంతపోలేదు, ఈ విషయమును నేను పాత్ర చిత్రణము నిరూపించు సందర్భమున చెప్పినాను.

చిలకమర్తివారి నాటకములలో నిది యుత్తమము గాదు, నాటకముల రచన ప్రారంభించబడిన క్రొత్తలో వ్రాయబడిన బృహన్నాటకమిది. ఆంధ్రనాటక వాఙ్మయ నిర్మాతలలో చిలకమర్తికి యుత్తమస్థానమున్నది. ఆ యుత్తమత్వము నాతడు పొందుటకు ఈ నాటకమొక పెద్ద మెట్టు.

కనుకనే దీని నింతగా విమర్శింప వలసి వచ్చినది. "నా నాటకములలో గయోపాఖ్యానము శ్రేష్ఠమని ప్రజలభిప్రాయ పడుదురు. ప్రసన్న యాదవము శ్రేష్ఠమని నాయభిప్రాయము."* అని చిలకమర్తియే వ్రాసికొనెను.

* చూ. స్వీయచరిత్ర. పుట. 258.

# రెడ్డిప్రభువుల వాఙ్మయ పోషణము

సుమారు క్రీ.శ. 1250-1320 మధ్యకాలమున కాకతీయుల సామంతులుగా, నిజాంరాష్ట్రమున వర్ధమానపురము రాయచూరు ప్రాంతములు రెడ్డివంశజులు పాలించిరి. వారిది గోనవంశము. ఆ వంశములోని బుద్ధభూపతి, కాచభూపతి, విఠలవిభుడు అనువారు ద్విపదచ్ఛందమున రామాయణమును రచించిరి. బాలకాండమునుండి యుద్ధకాండమువరకు బుద్ధారెడ్డియు, ఉత్తరకాండమును అతని పుత్రులమని చెప్పుకొనుచు కాచవిఠ్ఠల భూపతులును రచించిరి. దానికే రంగనాథ రామాయణమని పేరు. ఇటీవల ఆంధ్రవాఙ్మయరంగమున పరిశోధన మారంభమై తత్ఫలితముగా రంగనాథ రామాయణకర్తలు రెడ్లు కారనియు, రంగనాథుడను కవి రామాయణమును రచించి తనను పోషించు రాజులపేర వెలయించెననియు తేలినది. రెడ్లకర్తృత్వమును విశ్వసించువారును

కొందరుగలరు. నాకు జూడ రంగనాథుని కర్తృత్వమును స్థాపించువారు చూపిన హేతువులే బలవత్తరములుగా నున్నవి. పూర్వోత్తర రామాయణములయందలి రచనా విధానమును ఏకకవికర్తృత్వమునే స్థాపించుచున్నది. రంగనాథుడీ రామాయణ కర్తయగుటమూలమున ఆ రెడ్డి వంశజులకు వచ్చు హానియేమియు లేదు. అంతటి మహాకవిని పోషించిన గౌరవము ఆగోనవంశపు రెడ్లకుండ నేయుండును. కాకవారే రామాయణకర్త లన్నచో ఒక ఉద్గ్రంథ కర్తృత్వ గౌరవము వారికి దక్కుచున్నది. రాజవంశమువారు వాఙ్మయ స్రష్టలగుటలోకంటె, ముందు పోషకులగుటలోనే అందమున్నది. గోనవంశపు రెడ్లు అట్టివారనుటవలన వారికి వచ్చుగౌరవహాని లేదు.

రంగనాథ రామాయణము ద్విపదచ్ఛందమున వ్రాయబడినది. ఒక గ్రంథమునంతయు ఒకే ఛందమున వ్రాయుట ఆంగ్లముననున్నది. సంస్కృతమునను నున్నది. వాని విషయమున నేనేమియు ప్రస్తుతము చెప్పజాలను. తెనుగున మాత్రము ఒకేఛందమున వ్రాయబడిన గ్రంథమునకంటె వివిధచ్ఛందములలో వ్రాయబడిన గ్రంథమునందు కావ్యగౌరవము అధికముగా ప్రదర్శింపబడుట కవకాశముండునని నా విశ్వాసము. వృత్తౌచిత్యమున నాకు గౌరవ మధికము. ద్విపద గ్రంథములన్నియు నొకే ఛందమున వ్రాయబడినవే. అట్టి ద్విపదలో గ్రంథరచన చేసిన సుమారు 40 మంది రచయితలను, సుమారు 50 వరకువారి గ్రంథములను నే నెరుగుదును. నే నెఱిగిన గ్రంథములలో

25 కు పైగా ముద్రింపబడినవి. అందు 15 కు పైగా నేను జాగ్రత్తగా పరిశీలించితిని. ఈ ద్విపద గ్రంథరచయితలందరును కవితావేశమున కంటె మతావేశ మధికముగా గల వారు ఆ రెండిటికిని భేదమున్నది. కవితావేశమువలన కవిత్వము వ్రాయవచ్చునుగాని, మతావేశమువలన ఆ పని కాదు. ఈ మతావేశము వెనుక రెండు విధములు. శైవ మొకటి. వైష్ణవ మొకటి, ఇరువురును స్వమత ప్రచారమునకు గ్రంథములు వ్రాసిరి. ద్విపదచ్ఛందముననే వ్రాసిరి. మతావేశము శైవులలోకంటె వైష్ణవులలో తక్కువ. కవితావేశముండిమతావేశముతక్కువగుటవలన వైష్ణవులద్విపద గ్రంథములు శైవులవానికంటె కావ్యగౌరవముకలిగియున్నవి. రంగనాథరామాయణ మట్టి వైష్ణవ మతానుయాయుల గ్రంథమగుటవలన కావ్య గౌరవమందున్నది. కథా కథనమందును, సన్నివేశకల్పనమునందును. పాత్రోన్మీలనమునందును, ఉక్తి చమత్కృతియందును కావ్యత్వము నిముడ్చుకొనిన గ్రంథము రంగనాథ రామాయణము. సోదాహరణముగా పై విషయములను నిరూపించి చూపుటకి యుపన్యాసమున నవకాశము లేదు.

## 2

ఓరుగంటి ప్రతాపరుద్ర రాజన్యుడు మహమ్మదీయులచేత ఓడింపబడి ఢిల్లీనగరమునకు తీసికొనిపోబడినతరు

వాత, ఆ ప్రభునికడ దండనాథులుగానున్నట్టి రెడ్లు, వెలమలు స్వతంత్రులై ఆంధ్రదేశమున కొంతకొంత భాగము నాక్రమించుకొని పాలింపసాగిరి. అట్టి రెడ్లలో కోమటి ప్రోలయరెడ్డి రెండవ కుమారుడు వేమారెడ్డి ముఖ్యుడు. 1320 సం॥ ప్రాంతమున స్వతంత్రుడై 1349 సం॥ వరకును అద్దంకి రాజధానిగా ఆ పరిసర ప్రాంతమును పాలించుచు బలహీనులైనవారిని జయించుచు తన రాజ్యమును విస్తీర్ణము గావించెను. తానద్దంకియందుండి తాను జయించిన భాగములకు తన బంధువుల నధికారులుగా నియమించెను. ఈ వేమారెడ్డి తమ్ముడు మల్లారెడ్డి యనునాతడు సముద్ర తీరస్థ పట్టణములమీద నధికారము నెరపుచు వ్యాపారము నభివృద్ధిచేయుచుండెను. ఈ మల్లారెడ్డి ఆయా గ్రామములలో తిరుగుచున్నపుడు గుడ్లూర ఎఱ్ఱాప్రెగ్గడ యను కవి పండితుడు కనిపించెను. అతనిని తమ యాస్థానములో నుంచుకొని పోషించిన బాగుండునని తలచి అతనిని గొని వచ్చి తన యన్నగారైన వేమారెడ్డికి చూపి చెప్పెను. నాటినుండియు ఎఱ్ఱాప్రెగ్గడ వేమారెడ్డి యాస్థానకవి. వేమారెడ్డి బ్రాహ్మణ భక్తిగలవాడు. విద్వత్తును గౌరవించు నేర్పాతనికున్నది. అతని పెద్ద కుమారుడైన అనపోతారెడ్డి సేనానాయకుడు. వీరందరును పంటరెడ్లు. ఈ విషయము లన్నియు ఎఱ్ఱాప్రెగ్గడ రచించిన హరివంశ కృత్యాదిలోనున్నవి. ఈ కవి రామాయణమును, హరివంశమును వేమారెడ్డి యాస్థానమున నున్నకాలమున రచిం

చెను. ఆ గ్రంథము వేమారెడ్డికే అంకితము చేయబడినవి. రామాయణము నేడుపలభ్యముగాదు. రెడ్డిరాజుల ప్రాపు పోయిన తరువాత భారతారణ్య పర్వశేషమును, నృసింహ పురాణమును ఈ కవి రచించెను. భారతారణ్యపర్వశేషపు రాణమువలన కవిత్రయములోనికెక్కి ప్రబంధ పరమేశ్వరుడైన ఎఱ్ఱాప్రెగ్గడ నాస్థానపండితకవిగా నుంచుకొని పోషించిన రెడ్డిరాజుల వంశమును, వేమారెడ్డియు చిరస్మరణీయులు. ఆంధ్ర కవితాప్రవంతిని ఐతిహాసిక తీర్థమునుండి, పురాణ, కావ్య ప్రబంధతీర్థములవైపు మళ్ళించిన మొదటి మహాకవి ఎఱ్ఱన రెడ్డిరాజుల ఆదరాభిమానములచేతనే నిలువబడగలిగినాడు. కథా కథన విషయమున నన్నయను, అర్థగాంభీర్యాది శిల్పసంపాదనమున తిక్కనను ఆదర్శముగానుంచుకొని యౌచితినిబట్టి వర్ణనాంశములను చేర్చుచు కావ్యరచనచేసిన గౌరవము ఎఱ్ఱనకు దక్కినది. ఆతనిని ఆదరించిన గౌరవము రెడ్డిరాజులకు దక్కినది. ఎఱ్ఱాప్రెగ్గడపైన నేనుదాహరించిన గ్రంథములే గాక నీలకంఠేశ్వర శతకము నొకదానిని గూడ రచించి నట్లూహించుట కవకాశమున్నది. వెనుక ఒకసారి భారతి పత్రికలో శ్రీ వేటూరి వారు ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణములోనివని కొన్ని (27) పద్యములను ప్రచురించుచు చివర

"నిను సేవించిన గల్గు మానవులకున్ వీటీ వధూటీ ఘటీ
ఘనకోటీ శకటీ కటీ తటిపటీ గంధేభవాటీ పటీ
ర నటీ హాటిపటీ సువర్ణమకుటీ ప్రచ్ఛోటికా పేటికల్
కనదామ్నాయ మహాతురంగ శివలింగా! నీలకంఠేశ్వరా!"

అను పద్యము నొకదాని నిచ్చినారు. ఒంగోలు తాలూకా గుడ్లూరనున్న నీలకంఠేశ్వరస్వామివారి స్తుతి యిది. తన స్వగ్రామములోనున్న భగవంతుని 'స్తుతించినాడు. ఒక్క పద్యముతోనే ఆ స్తుతి ఆపియుండడు. కవిత్వము ప్రారంభించు దినములలో స్వగ్రామములోని ఈశ్వరునిపేర ఒక శతకము చెప్పియుండునని నాయూహ. శతకరచనమువలన కావలసిన మార్గమున పద్యమును నడుపుకొనుటకు తగినశక్తి అలవడును. మొదట మొదట కవికి శబ్దములతో కుస్తీపట్టుట అందముగానుండును. ఆ కుస్తీతరువాత తరువాత శబ్దముమీద అధికారము కలవానినిగా అతనిని తయారుచేయును. పైన నుదహరించిన పద్యము నేను చెప్పిన ఉపపత్తికి దోహదకారిగా నున్నది. భావి పరిశోధనవలన ఆ శతకము బయటపడవచ్చునని నా నమ్మకము.

ఎఱ్ఱాప్రెగ్గడతోపాటు సంస్కృత పండితులును వేమారెడ్డి యాస్థానమున నున్నారు. లొల్లమహాదేవుడను వాడందు ముఖ్యుడు. ఈతని వంశజులును రెడ్ల యాస్థానముననున్నవారే నని శ్రీ వేటూరివారి యభిప్రాయము. వీరందరును సంగీత సాహిత్యములందు ఘటికులు. వేమారెడ్డి సంగీత సాహిత్యములను సమముగా ఆదరించి పోషించినట్లు ఎఱ్ఱనయే చెప్పుచున్నాడు. వేమారెడ్డి విద్యా తపోవృద్ధులైన విప్రుల కగ్రహారములిచ్చి వారిచేత యజ్ఞములు చేయించెననియు, చెరువులు త్రవ్వించి, గుళ్ళ ప్రతిష్ఠించి సత్రములు పెట్టించి, తోటలు వేయించి, సద్ధర్మతాత్పర్య

బుద్ధియై, నీతినిధియై, జాహ్నవీ ప్రవాహమువలె భువన పావనమైన చరిత్రతో ధరణిని పాలించెనని ఎఱ్ఱన తన హరివంశమున చెప్పియున్నాడు.

వేమారెడ్డి తరువాత అతని పెద్దకుమారుడు అనపోతారెడ్డి రాజయ్యెను. తండ్రియుండగా నీతడు సేనానాయకుడు. అప్పటినుండియు ఇతడు కొండవీట స్థిరనివాస మేర్పరచుకొనియుండెను. తండ్రియనంతరము కొండవీడు రాజధానిగా రాజ్యపాలన కుపక్రమించెను (1350-1360). ఇతడును కవిపండిత పోషకుడై వెన్నెలకంటి వంశజుడైన ఒక కవి రచించిన గ్రంథములకు కృతిపతియైనట్లు [1500-1550] మధ్యనున్న వెన్నెలకంటి సూరన తన విష్ణుపురాణమున వ్రాసినాడు. వేమారెడ్డివలన అగ్రహారములు పొందిన వెన్నెలకంటి సూర్యుడను కవీంద్రకుంజరు డొకడున్నట్లు జక్కన [1340-1395] తన విక్రమార్క చరిత్ర షష్ఠ్యంతములలో వ్రాసియున్నాడు. అది ప్రక్షిప్తమని కొందరి యూహ. ఐనను వేమారెడ్డిచేత సత్కరింపబడిన వెన్నెలకంటి కవి* యొకడున్నాడని తేలుచున్నది. తండ్రియుండగనే అనపోతారెడ్డి సైన్యాధ్యక్షుడుగా నున్నాడుగదా! తండ్రియనంతరము రాజైనతరువాత ఆ వెన్నెలకంటి కవి కొన్ని గ్రంథములు రచించి అనపోతారెడ్డికి అంకితమిచ్చియుండవచ్చును. అవి కాలగర్భమున కలసిపోయినట్లుగనే భావింపబడుచున్నవి. గ్రంథములు కనిపించకపోయినను కవిపోషకుడు, కృతిపతి అను గౌరవ ప్రతిష్ఠలు మాత్రము అనపోతారెడ్డికి దక్కి నిలచియున్నవి. వెన్నెలకంటి సూరన్న

ఆ గ్రంథముల పేరయినను చెప్పకపోవుట విచారించదగిన విషయము. ఇతని యాస్థాన విద్యాధికారి బాలసరస్వతి.

అనపోతారెడ్డి తరువాత అతని అనుజుడు అనవేమారెడ్డి (1361-1370) కొండవీటి ప్రభువయ్యెను. ఇతని యాస్థానమున ప్రకాశ భారతీయోగి యను నుభయభాషా కవిత్వ విశారదుడుండెను. ఇతనికి ధర్మవేమన యని పేరు. ఇతని యాస్థాన విద్యాధికారిగా కొంతకాలము బాలసరస్వతియు, తరువాత త్రిలోచనాచార్యుడును ఉండిరి.

ఇతడు సంస్కృతాంధ్రముల ననేక కావ్యములు రచించెనట. అవి ఇంకను ఉపలభ్యములుగాలేదు. ద్రాక్షారామభీమేశ్వరాలయ శిలాశాసనములలో ఇతడు రచించిన రెండు సీసపద్యములు మాత్రమున్నవి. ఆ పద్యముల రచనా విధానమునుబట్టి ఇత డుత్తమకవి యగుటకు శక్తుడని యూహించవచ్చును. అనవేమారెడ్డి కవిపండిత పోషకుడైనట్లు సంస్కృతాంధ్రముల నున్న చాటువులు చెప్పుచున్నవి. ఇతడు గూడ కృతిపతియైనట్లు వెన్నెలకంటి సూరన విష్ణుపురాణమున చెప్పియున్నాడు. ఏ కవి రచియించిన గ్రంథములో మాత్రము చెప్పలేదు. ఇవియును నేడుపలభ్యములుగావు. తండ్రివలెనే అనపోత, అనవేమా రెడ్లిరువురును కవిపోషకులైనట్లు కృతిపతులైనట్లును తెలియుచున్నది.

అనవేముని యనంతరము, అనపోతారెడ్డి కుమారుడైన కొమరగిరిరెడ్డి (1371-1400) కొండవీట సింహాసన మధిష్ఠించెను. ఇతని బావమరదియైన కాటయవేమారెడ్డియే

ఇతనికి మంత్రి. కొమరగిరిరెడ్డియు, కాటయ వేమారెడ్డియు సంస్కృతమున నుద్దండ పండితులు. కొమరగిరి వసంతరాజీయ మను నాట్యశాస్త్రమును రచించెనని కాటయ వేమారెడ్డి శాకుంతల వ్యాఖ్యలో చెప్పెను. అది ప్రస్తుత ముప లభ్యముగాదు. కాటయవేముడు కాళిదాసకృత నాటకత్రయమునకు వ్యాఖ్య రచించెను. అది ప్రామాణిక వ్యాఖ్యగా ప్రాక్పశ్చిమ సంస్కృత పండితు లంగీకరించుచున్నారు. కొమరగిరి రెడ్డి భోగైకపరాయణుడు. ప్రతి సంవత్సరమును వసంతోత్సవములు చేయువాడు. ఈ యుత్సవములకు సుగంధద్రవ్యము లొసగు అవచితిప్పయ హరవిలాసకృతి భర్త. కాటయ వేము డెంత పండితుడో అంతవీరుడు. తూర్పుదేశమును జయించి రెడ్డిరాజ్యమును అభివృద్ధి చేసెను. రాజమహేంద్రవరము నాక్రమించి అచట తనకు ప్రతినిధిగా అల్లాడరెడ్డి నుంచెను. ఈ బావమరదు లిరువురును కృతిపతులు గాకపోయినను కృతికర్తలై చిరకీర్తి నార్జించుకొనిరి.

## 3

ద్రాక్షారామములోని యొక శిథిల శిలాశాసనమున కుమారగిరిరెడ్డికి అనపోతారెడ్డి యను కుమారుడున్నట్లున్నది కాని, ఆతడు తండ్రికంటె ముందే మరణించియుం

డుటవలన కాబోలును పెదకోమటి వేమారెడ్డి రాజయ్యెను. ఇతఁడు, రెడ్డి రాజ్యస్థాపకుఁడైన ప్రోలయ వేమన కన్నయైన మాచారెడ్డికి మనుమఁడు. కొమరగిరిరెడ్డికి దగ్గరజ్ఞాతి. అందువలన రాజయ్యెను. ఇతనికి వీరనారాయణుఁడని, సర్వజ్ఞచక్రవర్తి యనియు బిరుదనామములుగలవు. ఇతఁడు (1400-1420) వరకు రాజ్యముచేసెను. రెడ్డిరాజన్యుల పరిపాలనాకాలమున నీ యిరువది సంవత్సరములును స్వర్ణయుగము. ఇతఁడు స్వయముగ పండితుఁడు. ఇతని యాస్థానమున నీ యిరువదియేండ్లును శ్రీనాథుఁడు విద్యాధికారిగానుండెను. ఇతని యాస్థానమున వామన భట్టబాణుఁడను ఉద్దండ పండితకవి యుండెను. వీరిరువురును గాక పెదకోమటి వేమ భూపాలునిచే పోషించబడిన విద్వాంసు లనేకులు గలరు; అందు 1. పెద్దియజ్వ: ఇతఁడు బ్రహ్మసూత్ర్యాదిసిద్ధాంతవేత్త; యజ్ఞము చేసినవాఁడు. ఇతనికి కోమటి వేముఁడు కల్వపాముల అను గ్రామమును దానముచేసెను. గుడివాడ తాలూకాలోని కలువపాముల అదేకావచ్చును. (2) భాస్కరాచార్యుఁడు: మహా పండితుఁడు. భూలోక ధన్వంతరియను బిరుదుమోసినవాఁడు. వేము డితనికి పొన్నుపల్లి యను గ్రామమిచ్చెను. (3) గురు శంకరమహాని: ఇతఁడు నైషధ కృతిపతియైన మామిడిసింగనకు గురువు. శైవాచారవేత్త. పినపాడు అను గ్రామమును వేమునినుండి ఇతఁడు గ్రహించెను. (4) విశ్వేశ్వరపండితుఁడు ఇతఁ డలంకార శాస్త్రపారంగతుఁడు. చమత్కారమంజరి యను అలంకారశాస్త్ర గ్రంథకర్త. ఆలపాడును వేముఁడీతనికి దానము చేసెను. (5) రామచంద్ర సిద్ధాంతి: జ్యోతిష

పండితుఁడు. పెద్దియజ్వ పుత్రుఁడు. వేమారెడ్డి రుద్రవర గ్రామ మితనికి దానముచేసెను. (6) పిశిపాటి రామభద్ర సోమయాజి: ఇతఁడు వేదవేత్త. పొట్లపాడు గ్రామమీతని కీయబడినది. వీరు ముఖ్యులు. వీరుగాక సింగనార్యుఁడు, ఎల్లె పెద్ది లక్ష్మణదీక్షితులు, షడ్దర్శనాల వల్లభసోమయాజి మొదలైనవారు గలరు. పెదకోమటి వేమభూపాలుని శాసనములు పదమూఁడు మాత్రమే ఇప్పటికి లభించినవి. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు వాని నన్నింటిని ప్రచురించిరి. ఆ శాసనముల మూలముననే వేమారెడ్డిచేత పోషింపబడి యీ పండితుల నామములు మన కెరుకపడినవి. ఇంకను కొన్ని శాసనము లుండియుండునని పరిశోధకుల యూహ. అవి బయలు పడినచో ఆ భూపాలునిచే పోషింపబడిన విద్వాంసు లింకను చాలమంది మనకు తెలియుదురు. పెదకోమటి వేమారెడ్డి దర్శనమునకు ప్రతిదినమును చిల్లరకవులు వందలసంఖ్యలో వచ్చుచుండెడివారు. ఈ విషయము శ్రీనాథుని.

"బూడిదబుంగవై యొడలు పోఁడిమిదక్కి మొగంబువెల్లనై
వాడల వాడలం దిరిగి వారును వీరును ఛీ ఛీ ఛీయనన్
గోడల గొందులందొదిగి కూయుచునుండెదు కొండవీటిలో
గాడిద! నీవునుం గవివికావుగదా! యనుమానమయ్యెడిన్" అను చాటువునుండి యూహింపబడినది. కొండవీటిలో గాడిద లధికమట. కవులును అట్లే. సన్మానార్హత లేనివారును తాము వ్రాసినది కవిత్వమను నమ్మకముతో ఆ వీటనే యుండి నిరంతరమును స్వీయకావ్యగానం చేయుచుండెడి

వారు కాబోలును! గాడిదలును అగ్గి అందరిచేతను అద లింపబడి గొందులలో నొదిగి కూయుచుండెడివి. ఆ కవుల తాపత్రయము-ప్రయత్నము చూచి శ్రీనాథుడు హాస్యము నకా పద్యము చెప్పియుండును. శ్రీనాథుడుగాక మరొకడు చెప్పినను నాటికాలపు కవుల సమ్మర్దము ఆ పద్యమువలన వ్యక్తమగుచునే యున్నది.

ఇంతమంది పండితులను పోషించి రాచరికము నెర పిన, సంస్కృత ప్రాకృతాంధ్రములందు అనన్య సామాన్య మైన ప్రజ్ఞగలిగిన, పెదకోమటి వేమభూపాలుని యాస్థా నము నలంకరించిన ఇరువురు పండితకవులును బహుగ్రంథ కర్తలు. వామన భట్టభాణుడనువాడు (1) వేమభూపాల చరితము (2) నలాభ్యుదయము (3) రఘునాథాభ్యుదయము అను కావ్యములును; శబ్దరత్నాకరము, శబ్దచంద్రిక యను నిఘంటువులును; పార్వతీ పరిణయము, శృంగార భూష ణము అను రూపకములును; హంస సందేశమను ఖండ కావ్యమును రచించినాడట. వేమభూపాలచరిత మనునది ఆఖ్యాయిక. ఈ గ్రంథముల నన్నింటిని తాము చూచినట్లు శ్రీ వేటూరివారు వ్రాసినారు (శృం శ్రీ. పు. 78). సాహిత్య చూడామణియనియు, గద్యకవి సార్వభౌముడనియు ఇతని బిరుదములు. ఇంతటి విద్వాంసునిముందు విద్యాధి కారి పదవిలోనున్నవాడు శ్రీనాథుడు. ఇతడు కొండవీడు చేరునప్పటికే మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతి రచియించెను. పండితారాధ్యచరిత్ర రచించుచు కొండవీడు

చేరి మామిడి ప్రెగడన మంత్రికి కృతినిచ్చెను. ఇది 1400 ప్రాంతమున జరిగినది. పెదకోమటి వేమభూపాలునియాస్థాన విద్యాధికారి పదవి స్వీకరించినాడు. అందుకు ప్రెగడమంత్రి తమ్ముడైన సింగమంత్రి సహాయమును గూడ పొందియుండ వచ్చును. ఆ సింగమంత్రి పెదకోమటి భూజానికి మంత్రి. 1405-1410 సం. ల మధ్యకాలమున హర్షనైషధము నాంధ్రీకరించి ఆ మంత్రిశేఖరున కంకితమిచ్చి యుండును. శ్రీనాథుడు పెదకోమటి వేముని యాస్థానముననున్న ఇరువది సంవత్సరములలోను, ఒక్క నైషధమును మాత్రమే వ్రాసెను. తరువాత గ్రంథరచనకు తగిన తీరిక యుండి యుండదు. అతడు విద్యాధికారి గదా!

### పెదకోమటి వేమారెడ్డియు బహుగ్రంథకర్త

1. అమరుకకవికృత అమరుకమను శృంగార శతకమునకు "శృంగారదీపిక" యను వ్యాఖ్య. అమరుకమునకు మరి కొన్ని వ్యాఖ్యలున్నవనియు, దీనికే ప్రచారము మెండనియు, ఇదివిపులమైన చక్కనివ్యాఖ్యయనియు శ్రీ వేటూరి వారి యభిప్రాయము. 2. హాలుని సప్తశతిలోనుండి నూరు గాథలనేరి వానికి "సప్తశతీసారటీక" వ్రాసెను. 3. ధ్వన్యాలోకాదులను పరామర్శించుచు మహిమభట్టు ననుమానమును ఖండించు "సాహిత్యచింతామణి" యను అలంకార శాస్త్ర గ్రంథము. 4. సంగీత చింతామణి. ఇవికాక ఇంకను ఆ రెడ్డినృపాలుని కృతులుండియుండునని పరిశోధకులు తలచుచున్నారు.

రాజునకు తగిన మంత్రి మామిడి సింగన. ఇతడు సోమసిద్ధాంతమను జ్యోతిషశాస్త్ర గ్రంథమునకు "గూఢార్థదీపిక" అను వ్యాఖ్యానమును రచించెను. దాని రచనా కాలము 1418 సంవత్సరము.

పెదకోమటి వేమభూజాని సాహిత్య సార్వభౌముడు. సమరాంగణపార్థమూర్తి. దానకర్ణుడు. ఈ విషయములను వ్యక్తముచేయు చాటువులు సంస్కృతమునను, ఆంధ్రమునను నున్నవి. ఇరువది సంవత్సరములు కొండవీటిరెడ్డి సింహాసన మధిష్ఠించి కవిపండిత పోషకుడై నీతిమార్గము దప్పక రాజ్యపాలనము గావించిన రెడ్డిసార్వభౌముడు అసమర్థుడైన కుమారునిచూచుకొని సగమును, రాజమహేంద్రవర రెడ్డిరాజన్యుల యొక్కయు, రాచకొండ వెలమరాజుల యొక్కయు బలవత్తరమై యెత్తివచ్చు శత్రుత్వమునుచూచి సగమును ఆయుపు పోగొట్టుకొనినాడు (1420). పెదకోమటి వేముని కుమారుడు రాచవేముడు 1424 సం. న మరణించెను. శ్రీనాథుడు కంచికి వెళ్ళెను.

# 4

కొమరగిరి రెడ్డి జీవించియున్న కాలముననే, తనస్థితి కనేక విధముల కారకుడును, భావుకుడును ఐన కాటయ వేమారెడ్డికి రాజమహేంద్రవరమును పారితోషికముగా

నిచ్చినట్లు తొ త్తరమూడి తా మ్రశాసనము చెప్పుచున్నది. కాటయవేముడే రాజమహేంద్రవరము సంపాదించి అట అల్లాడరెడ్డిని ప్రతినిధిగా పెట్టినట్లు వెనుక చెప్పియున్నాను. కొమరగిరి తరువాత కొండవీటి సింహాసన మధిష్ఠించగా కాటయవేముడు రాజమహేంద్రవరము చేరెను. (దీని మొదటిపేరు "పితంద్ర" యట. శ్రీ. ఓ. కా.) రాజమహేంద్రవరపు రెడ్డిరాజులలో కాటయవేముడే మొదటివాడు. కొమరగిరిరెడ్డి యిచ్చినందున కాటయవేమునకు రాజ్యము వచ్చినది కాని, లేనిచో ఇదికూడ పెదకోమటి వేమారెడ్డికి సంక్రమించవలసినది. రావలసినది రాకుండుట యెవరికైనను కష్టము కలిగించును. క్రమమో, అక్రమమో వచ్చినదాని నెవడును పోగొట్టుకొనడు. అందువలన పెదకోమటి వేమారెడ్డికిని, కాటయవేమారెడ్డికి విరోధము ప్రబలినది. పెదకోమటి వేమారెడ్డి రాజమహేంద్రవరమును జయించి ఆక్రమించుకొనుటకు చూచెను. అల్లాడరెడ్డిచేత రామేశ్వరము (గోదావరిజిల్లా) వద్ద యుద్ధమున పెదకోమటి వేముడోడింపబడెను. ఈ విషయము అల్లాడరెడ్డి పెద్దకుమారుడు వేమారెడ్డి వ్రాయించిన కోరుమిల్లి శాసనమున నున్నది. నిశ్శంక కొమ్మన యనునాతడు తన శివలీలా విలాసమున కూడ ఈ విషయము చెప్పెను. అల్లాడరెడ్డి, అతని సచివుడు అరియేటి లింగన యవన కర్ణాటక భూపతులతో మైత్రిని కలిగియున్నట్లు శ్రీనాథుడు తన భీమఖండమున చెప్పియున్నాడు. స్వయముగా అద్వితీయమైన పరాక్రమము గలిగి, కొందరు రాజన్యులతో మైత్రి కలిగియున్న అల్లాడ

రెడ్డిని జయించుట పెదకోమటి వేమారెడ్డికి తలకుమించిన పనియైనది. ఈ విధముగ కొంతకాలము గడచినది.

అల్లాడరెడ్డి రెండవ కుమారుడైన వీరభద్రారెడ్డికి, కాటయవేముడు తన కూతురైన అనితల్లినిచ్చి వివాహము చేసి, అల్లాడరెడ్డితో గల సంబంధమును బంధుత్వముగా మార్చినాడు. దాని కల్లాడరెడ్డియు సంతోషించినాడు. కాటయవేముని తరువాత అతని కుమారుడు కుమారగిరిరెడ్డి రాజై వెంటనే మరణించెను. అపుడు రాజమహేంద్రవర రాజ్యము అనితల్లికి రావలసియున్నది. ఆయదనున వెలమలు, గజపతులు ఆ రాజ్యమును ఆక్రమింప జూచిరి. కాని అల్లాడరెడ్డి వారి నెదుర్కొని అనితల్లికే రాజ్యముండునట్లు చేసెను. అనితల్లి భర్తయైన వీరభద్రారెడ్డి రాజమహేంద్రవర రాజ్యసింహాసన మధిష్ఠించెను. అతని అన్నయైన వేమారెడ్డి పరాక్రమవంతుడై కటకమువరకు జయించి రెడ్డిరాజ్యమును విస్తరింపజేసెను. ఇతడు శివపూజా తత్పరుడు. శ్రీనాథు డితనినిగూర్చి తన కాశీఖండమున వ్రాసెను. అనితల్లి రాజ్యాధికారిణి. వీరభద్రారెడ్డి రాజు. అల్లయ వేమారెడ్డి సర్వనిర్వాహక చక్రవర్తియైన పాలకుడు. వీరియనుజుడు దొడ్డారెడ్డి చేదోడు వాదోడు.

కొండవీటి రాజ్యము పతనమైన తరువాత శ్రీనాథుడు కంచికి వెళ్ళెనంటిని. అచట "హరవిలాసము" రచించి తన చిన్ననాటి స్నేహితుడైన అవచిదేవయ తిప్పయకు కృతియిచ్చి (1425) అటునిటు తిరిగి రాజమహేంద్రవర ప్రాంతము వచ్చినాడు. వీరభద్రారెడ్డి రాజుగా నున్నాడు.

అతనివద్ద బెండపూడి అన్నయ్యమంత్రిగానుండెను. అతడు పాకనాటి నియోగి బ్రాహ్మణుడు. శ్రీనాథుడును పాకనాటివాడే. బాంధవ్యము కలిసినది. అన్నమంత్రికి భీమేశ్వర పురాణము రచించి (1430) కృతినిచ్చినాడు. నెమ్మదిగా రాజాశ్రయమును సంపాదించుకొనినాడు. భీమేశ్వర పురాణ కృతిసమర్పణ మహోత్సవమునకు వేమారెడ్డి, వీరభద్రారెడ్డి వచ్చియుందురు. అప్రస్తుతమైనను, ఆశ్రయమును కోరినవాడగుటచేత శ్రీనాథుడు, భీమఖండమునముందు వేమారెడి, వీరభద్రారెడ్లను గూర్చి 14 గద్యపద్యములను చెప్పినాడు. వారి కీతనియందు గౌరవమేర్పడినది. దగ్గరకుతీసినారు. వారు శైవులు. శ్రీనాథుడు తానును శైవుడే. అంతకు పూర్వము దక్షిణకాశి యని పేరుగాంచినదాక్షారామమును వర్ణించియున్నాడు. అసలు కాశీనగర మహాత్మ్యమునే వ్రాయవలసినదిగా వీరభద్రారెడ్డి కోరినాడు. శ్రీనాథు డుపక్రమించినాడు. కాశీఖండమును రచించి (1434) వీరభద్రారెడ్డికి కృతియిచ్చినాడు, వీరభద్రారెడ్డి శ్రీనాథుని యాదరించి కృతిభర్త కాగా, అతని తమ్ముడు దొడ్డారెడ్డి నిశ్శంక కొమ్మన యను కవి నాదరించి శివలీలావిలాసమను గ్రంథమును కృతిగైకొనెను. వీరభద్రారెడ్డి తరువాత 1438 ప్రాంతమున కర్ణాటకాధీశ్వరుడైన ప్రౌఢదేవరాయలు రాజమహేంద్రవరము నాక్రమించెను. శ్రీనాథుడు మరల దేశసంచారము చేయవలసినవాడాయెను. శివరాత్రిమాహాత్మ్యమును (1440) పల్నాటి

వీరచరిత్రమును, మొదలైనవానిని ఆకాలమున శ్రీనాథుడు రచించెను.

రెడ్డిరాజన్యుల పాపునఘండి శ్రీనాథుడు రచించిన గ్రంథములు మూడు. 1. శృంగార నైషధము. 2. భీమేశ్వర పురాణము, 3. కాశీకాఖండము: ఈ గ్రంథములను సమగ్రముగ విమర్శించి కావ్య గౌరవమును నిరూపించుట కిది తావుగాదు. ఐనను నా యభిప్రాయమును చెప్పి ముగింతును. శ్రీనాథుని గూర్చి అతని శిష్యుడును, బావమరదియునైన దగ్గుబల్లి దుగ్గన తన నాచికేతోపాఖ్యానమున (1460).

"సంస్కృత ప్రాకృత సౌరసేనీ ముఖ్య భాషాపరిజ్ఞాన పాటవంబు
పన్నగపతి సార్వభౌమ భాషిత మహాభాష్య విద్యాసమభ్యాస బలము
అక్షపాద కణాద పక్షిలోదీరిత న్యాయకళా కౌశలాతిశయము
శ్రుతి పురాణాగమ స్మృతి సాంఖ్యసిద్ధాంత కబళన వ్యుత్పత్తి గౌరవంబు

పూర్వకవిముఖ్య విరచితాపూర్వ కావ్య
భావరస సుధాచర్వణ ప్రౌఢతయును
గండళింపగఁ గాశికాఖండ నైష
ధ ప్రముఖ వివిధ ప్రబంధము లొనర్చె"

అని చెప్పినాడు. ఇందువలన శ్రీనాథుని బహుముఖమైన పాండిత్యము వ్యక్తమగుచున్నది. ఇంత పండితుడు గనుకనే

పెదకోమటి వేమారెడ్డి యాస్థానమున విద్యాధికారిగానుండి బహుశాస్త్రములలో పండితులైనవారిని పరీక్షించగలిగినాడు. అతని గ్రంథములలో ఆశాస్త్రపాండిత్యస్ఫురణ యుండనేయున్నది. ఆ స్ఫురణ మధికముగానున్న గ్రంథములు నైషధము, కాశీఖండ మగుటకాబోలును దేశమున ఆ గ్రంథము లుత్తమమైనవను ప్రచారము జరిగినది. ఆ ప్రచారమునకు కారకులు ఆయా శాస్త్రములలో నుద్దండ పండితులు. మిగిలినవారు వారియందున్న గౌరవమునుబట్టియు తమకు స్వయముగ నిర్ణయించుకొను శక్తి లేకపోవుటను బట్టియు ఆమాట నంగీకరించి అవకాశము లభించినపుడా మాటనే చిలుకవలె పలుకుదురు. కావ్యాంశ లోపించి శాస్త్రవైదుష్యము వెల్లివిరిసిన ఒక గ్రంథ ముత్తమ కావ్యము కాజాలదు. కావ్యాంశకు శాస్త్ర పరిజ్ఞానము మెరుగుపెట్టు పనిముట్టువలె నుండవలెను. శ్రీనాథుని మిగిలిన గ్రంథములందుకంటె కావ్యాంశ భీమేశ్వర పురాణమున నున్నదని నా విశ్వాసము. ఉత్తమ కావ్యమునకు ప్రధానమైన సంయమనముతో గూడిన భావుకత భీమేశ్వర పురాణమున నున్నది. సోదాహరణముగ నిరూపించుట కిది తావుగాదని వెనుకనే వ్రాసితిని. మరొకసారి అవకాశము వచ్చినపుడా విషయమును వివరింతును. ఇందువలన కాశీఖండ నైషధములు కావ్యములు గాదని నా యభిప్రాయమని పొరపాటుపడరాదు. ఉత్తమ కావ్యగుణములు వానిలోకంటె భీమఖండమున అధికముగా నున్నవనియే నా యభిప్రాయము. శాస్త్రవైదుష్య ప్రపంచనార్థమైన విను

ర్ణన నేను చేయలేను. నాది రస ప్రపంచసదృష్టి. పండితు డైన శ్రీనాథునియందు నాకు భక్తియున్నది. కవియైన శ్రీనాథునియందు నాకు గౌరవమధికము. కవిగానే శ్రీనాథుని నేను దర్శించగలను. అపుడు భీమఖండమే నా ముందు నిలచును. "ఖండన గ్రంథ సంగ్రథన కర్కశబుద్ధి" యు "షట్తర్క మర్మైక చక్రవర్తి" యు నైన భట్టహర్షుడు "ప్రౌఢవాక్పాటవమున" రచియించిన నైషధమును ఆంధ్రమున వ్రాసిన శ్రీనాథుడునుఅట్టివాడే. ఆంధ్రనైషధ మునను ప్రౌఢవాక్పాటవమున్నది. సర్వత్ర నీ వాక్పాట వము కావ్య గౌరవమును ఇనుమడింపజేయ జాలదు. నైష ధమునకు పట్టిన దురవస్థ యిది. కాశీఖండ మీ యవస్థ నుండి కొంత తప్పుకొన్నది. భీమఖండము ఔచితినిబట్టి వాక్పాటవమును ఇముడ్చుకొనినది. శ్రీనాథుని మహాపండి తుడని ఋజువుచేసినది నైషధము. మహాకవియని ధృవపర చినది భీమఖండము. రెండింటిని ఇముడ్చుకొని పాండి త్యమువైపు మొలుసూపించునది కాశీఖండము.

దొడ్డారెడ్డి కంకితమీయబడిన నిశ్శంక కొమ్మన శివ లీలా విలాసము సమగ్రముగా లభించలేదు. లభించినదానిని బట్టి మధ్యతరగతి కవుల శ్రేణిలోనివాడని ఆ కవిని నిర్ణ యించవచ్చును.

ఫణిరాజమహాభాష్య ఫక్కికా పరమేష్ఠి సింగనా ర్యుడు, పెద్దియజ్వ మొదలైన మహాపండితులను; వామన భట్టబాణ శ్రీనాథాది మహాకవులను ఆదరించి పోషించి

ఆంధ్రవాఙ్మయమునకు పుష్టి చేకూర్చిన రెడ్డిరాజ్య మస్త మించినది. స్వతంత్రులైన రెడ్డిరాజులు ఆంధ్రదేశమున అధికారము నెరపిన బంగారుకాల మంతమయినది. ఆంధ్ర దేశమున సామంతులైన రెడ్డిరాజు లచ్చటచ్చట పరిపాలించిరి. వారును శక్తికొలది ఆంధ్రవాఙ్మయమును పోషించిరి. రాజమహేంద్రవర రెడ్డిరాజ్య మస్తమించిన తరువాత, విజయనగరము రాజధానిగా ఆంధ్రదేశమును పాలించిన రాజన్యులలో శ్రీకృష్ణదేవరాయలు ముఖ్యుడు. అతని కాలమున కొండ మరుసయ్య యను బ్రాహ్మణుడు ఉదయగిరి దుర్గాధిపతిగా నుండెను. అతనికి కప్పముగట్టు స్థితిలో గుడ్లూరు రాజధానిగా ఆ పరిసర ప్రాంతమును పాలించు పంటరెడ్డి రావూరివంశజు డొకడుండెను. అతనిపేరు రాఘవ రెడ్డి. తన తండ్రిపేర బసవాపురమను అగ్రహారమును వెన్నెలకంటి సూరనామాత్యునకిచ్చి అతనిచేత విష్ణుపురాణము (మొదటిభాగము) ను రచింపించి రాఘవరెడ్డి కృతిభర్త ఆయెను. వెన్నెలకంటి సూరన పురాణ రచనమున సిద్ధహస్తుడైనట్లు అతని గ్రంథము ఋజువుచేసి చూపగలదు. ఇంకే గ్రంథములు రచించినట్లును ఇతడు చెప్పుకొనలేదు. ఇతడు 1500-1550 ప్రాంతమువాడు.

గోలకొండ మహమ్మదీయ ప్రభువులకు సామంతులుగా చిక్కనవోలు సంస్థానము నేలు రెడ్డివంశ మొకటున్నది. వారు కామినేనివారు. వీరు పాకనాటిరెడ్లు. వీరివంశములో ఎల్లారెడ్డియనువాడు, బాలభారతము, కిరాతార్జునీయము, అను రెండు గ్రంథములను కృతినందినట్లు 1530

1590 ప్రాంతమున ఆ సంస్థానము నేలిన కామిరెడ్డికి కృతి యీయబడిన సూతసంహితలో నున్నది. ఆ గ్రంథములు నే డుపలభ్యములుగావు. కామారెడ్డి యాస్థానమున పట్టమట్ట సోమనాథ సోమయాజియను పండితకవి యొకడుం డెను. అతడు సూతసంహిత, (1578) రచించి కామిరెడ్డికి కృతియిచ్చెను. బ్రహ్మోత్తర ఖండమును రచించి. కామిరెడ్డి తమ్ముడైన ఎల్లారెడ్డికి కృతియిచ్చెను. ఆ రాజసోదరు లిరువురును కవిపోషకులు, కృతిభర్తలు. వారి తమ్ముడు మల్లారెడ్డి బహుగ్రంథకర్త. ఎల్లారెడ్డిగూడ వాసిష్ఠలైంగ ధర్మమను గ్రంథము రచించినట్లు మల్లారెడ్డి తన పద్మపురాణమున చెప్పినాడు. కవిపోషకులు కృతికర్తలు ఐన ఈ కామినేని రెడ్డిరాజన్యుల యాస్థానముననున్న పట్టమట్ట సోమనాథ సోమయాజి కవితా విలాసమున శ్రీనాథునితో తులతూగుచుండునని శ్రీ చాగంటి శేషయ్యగారు వ్రాసినారు. ఆ గ్రంథములను నేనింకను సమగ్రముగ పరిశీలించలేదు. కనుక ఇంతకంటె సోమనాథ సోమయాజిని గురించి అధికముగా నేను చెప్పజాలను. ఇతని గ్రంథములలో పద్య రచనా విధానము శ్రీనాథుని దానివలె నుండుట నేను గమనించితిని.

"అస్మద్గురుస్వామియైన లింగారాధ్య సార్వభౌము ప్రసాద
సౌష్ఠవంబు
ఆత్మాప్తుడు సతీర్థ్యుడైన కామారెడ్డి పట్టభద్రుని ధర్మ
పాటవంబు

తత్సభా సదులైన ధన్య విద్వాంసుల సంతత సల్లాప సమ్మతంబు
ఘనుడు విద్యారణ్యముని యేర్పరించిన తాత్పర్య దీపిక దారికలిమి

కారణంబులుగా నిరాఘాట చాటు
శుద్ధ పద్ధతిఁ దెనుగున సూతసంహి
తా చతుర్విధ ఖండసందర్భ మెల్లఁ
గావ్యమొనరింతు లోకవిఖ్యాతముగను."
—సూతసంహిత, సోమయాజి.

"ఆంధ్ర క్ష్మామండ లాఖండలుండైన వేమభూపతి కృపావీక్షణంబు
ఘోడెరాయాంక సద్గురురాజ భీమేశ్వరస్వామి పదసమారాధనంబు
కమలాద్రి నిలయ మార్కండేయ శివమౌళి చంద్రాంశు నవసుధాసారధార
వేదాద్రి నరసింహ విపుల వక్షస్థలీ కల్హారమాలికా గంధలహరి

కారణంబులు సుద్బోధకములు గాఁగ
సంభవించిన సాహిత్య సౌష్ఠవమున
వీరభద్రేశ్వరుఁ బ్రబంధ విభునిఁ జేసి
కాశికాఖండముఁ దెనుంగుగా నొనర్తు.
—కాశీఖండము, శ్రీనాథుడు.

శ్రీనాథుని కాశీఖండ పద్యమును మనసున బెట్టు కొనియే సోమనాథ సోమయాజి సూతసంహితలో ఆ

పద్యము రచించియుండు ననుట నిర్వివాదము. రచనావిధానమున శ్రీనాథుని యనుకరించుటకు యత్నించినను శిల్ప నిర్వహణమున వెనుకబడక తప్పినదిగాదు. సోమనాథసోమయాజి ఆ శతాబ్దపు కవులలో నుత్తమతరగతికి చెందినవాడనుటలో నాకు విప్రతిపత్తి లేదుగాని: కవితా విలాసమున శ్రీనాథునితో తులతూగునను విషయమును నేనంగీకరించలేను. గ్రంథ పరిశీలనమువలన నా యభిప్రాయము దృఢపడుననను విశ్వాసము నాకున్నది: సోమనాథ సోమయాజి తనను గురించి "పాతంజలిగ్రంథ ఫక్కికా సందర్భ నిర్భేదన క్రియా నిశితబుద్ధి" ననియు; "తర్క వేదాంత ధర్మశాస్త్రవేత్త" ననియు: "బహువిధాలంకార భావధ్వని విశేష సాహిత్య సర్వంకషుడ" ననియు చెప్పుకొని యుండుట మూలమున శ్రీనాథుని యంతటి పండితుడని నిర్ణయించి, శ్రీనాథునివలె రచనచేయవలయుననన్న ప్రయత్నము చేసినందున, సోమనాథ సోమయాజిని గూర్చి శ్రీశేషయ్యగా రభిప్రాయ మిచ్చియుందురు. సోమనాథ సోమయాజి శ్రీనాథుని యంతటి పండితుడు కావచ్చును గాని, అంతటి కవిమాత్రముగాదు. శ్రీనాథునితో పోలికను వదలినచో సోమనాథ సోమయాజి ఉత్తమ పండిత కవులలో చేరగలడు. అటివానిని ఆదరించి పోషించిన గౌరవము సామంతమైన కామినేని రెడ్డివంశము దక్కించుకొనినది. ఎల్లారెడ్డి రచించిన "వాసిష్ఠలెంగధర్మము" నే డుపలభ్యంగాదు. అతని తమ్ముడు మల్లారెడ్డి 1. షట్చక్రవర్తి చరిత్రము, 2. శివధర్మోత్తర (ఖండ) ము, 3. పద్మపురా

ణము, రచించెను. మొదటి గ్రంథమున హరిశ్చంద్రుడు, నలుడు, పురుకుత్సుడు, పురూరవుడు, సగరుడు, కార్తవీర్యుడు అను ఆరుగురు రాజన్యుల చరిత్రమును ఆరాశ్వాసములలో వర్ణించబడినది. మొదటి రెండు కథలు మిగిలిన వాటికంటె రసవత్తరములు. రెండవగ్రంథము ధర్మశాస్త్ర విషయ వివరణము. కవిత్వ ముండుట కంతగా తావులేని గ్రంథ మది. మూడవది శివప్రభావమును నిరూపించు గ్రంథము. ఐదాశ్వాసములు. కావ్యగుణములను కొన్నింటి నిముడ్చుకొనినది.

"చాటుచాటు తేనియల్ వడయు సూక్తులు ప్రాక్తనజన్మపుణ్య సం
ఘటితములై కవీంద్రుల కఖండ ముదంబు హృదంబుజాబునం
బాటముగఁ జేయఁ గ్రమరసపూరముగా మహితప్రబంధముల్
పటుమతి సల్పగాఁ దగిన ప్రాజ్ఞుడు మల్లనృపాలుడెంతయున్

—పద్మపురాణము, మల్లారెడ్డి

తనను గూర్చి మల్లారెడ్డి చెప్పుకొనిన పైపద్యము కేవల మతిశయోక్తి మాత్రముగాదు. మొదటి రెండింటిలోకంటె పద్మపురాణమున పరిణతమైన కవిశక్తియున్నది. ఇవిగాక మల్లారెడ్డి మరికొన్ని కృతులను రచంచినట్లు చెప్పుదు రనియు, కాని వాని వివరములేమియు తెలియరాలేదనియు శ్రీ చాగంటి శేషయ్యగారు వ్రాసినారు.

ఇంతటితో బిక్కనవోలు సంస్థానాధీశుల వాఙ్మయ పోషణమును ముగిసినది. వీరి తరువాత నగరాధిపతులైన రెడ్డివంశజులు కూడ తమ శక్తినిబట్టి వాఙ్మయము నాదరించిరి. వారిలో కర్ణాట తిలకుడును, పరిపాలనాభార ధౌరేయుడును, లలితచౌషష్టికళా ప్రవీణుడును నైన జంగాల ముమ్మయరెడ్డి ముఖ్యుడు. ఇతనిని గూర్చిన చారిత్రక విషయము లింకను పూర్తిగా తెలియరాలేదు. ఇతడు ద్విపద భారత కర్తయైన తిమ్మయకవి నాదరించి అతనివలన భారత విరాటపర్వమును కృతినందుకొనినాడు. ఆ కవి పోషణభారమంతయు వహించి ద్విపదభారతము నంతయును తిమ్మయ వ్రాసిన దంతయును-కృతినందు భాగ్యమా రెడ్డివంశజునకు లేకపోయినది కాబోలును. ఒక్క విరాటపర్వముతోనే తృప్తిపడి యూరకుండినాడు. ఈ కవియు, కృతిపతియును నెల్లూరు మండల మందలి బట్టేపాడు గ్రామస్థులు. ఆ గ్రామమే ఆముమ్మయరెడ్డి అధికారములో నుండెడిదేమో! ఈ కవికాలము 1550-1600 కావచ్చునని శ్రీ పి. ల. కాంతముగారు వ్రాసినారు. కవిత్రయమువారి భారతము నాధారముగ తీసికొని ఈ తిమ్మన అటుతర్వాత సోమన, బాల సరస్వతియనువారు ద్విపద భారతమును రచించిరి. ఆ గ్రంథమును విమర్శించి కావ్యగుణమును నిర్ణయించుటకిది తావు గాదు.

1640-1670 ప్రాంతమున కొండవీటి సీమలోనున్న భక్తవాడపురాధిపతియైన తుమ్మరాచుపరెడ్డి పింగళి ఎల్లనయను కవి నాదరించి అతనిచేత సర్వేశ్వర మాహాత్మ్యము

(త్రోభ్యచరిత్రము) ను రచింపించి, సర్వేశ్వరున కంకిత మిప్పించెను. ఆ భక్త వాడయను పుర మీనాడే పేరుతో నున్నదో ఇంకను తెలియరాలేదు.

1750 ప్రాంతమున గద్వాల సంస్థానమును పాలించిన సోమభూపాలుడు కాణాద పెద్దన సోమయాజి యను కవి నాదరించెననియు, ఆ కవి 1. అధ్యాత్మ రామాయణము, 2. ముకుందవిలాసము అను గ్రంథములను రచించెననియు, సోమభూపాలుడు స్వయముగ కవియై జయదేవ గీత గోవిందమును ఆంధ్రీకరించెననియు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు వ్రాసియున్నారు. నే నా గ్రంథములను చూడలేదు.

1825_70 ప్రాంతమున బళ్ళారి మండలమున నున్న జుహారా పురాధిపతియైన సంజీవిరెడ్డియను నాతడు గురురాజు అను కవిని పోషించినట్లు కవుల చరిత్ర చెప్పుచున్నది. ఆకవి రచించిన గ్రంథములు: 1. పద్మావతీపరిణయ నాటకము, 2. రుక్మిణీపరిణయ కావ్యము, 3. రాఘవేంద్రాష్టకము, 4. అనిరుద్ధ చరిత్రనాటకము, 5. భర్తృహరి శతకముల కాంధ్రీకరణము, 6. శేషధర్మములు. ఇవిగాక ఇంకను కొన్ని కర్ణాటక కృతులు గూడ రచించినాడట. శేషధర్మములు దక్క మరే గ్రంథమును లభ్యముకాలేదు. పై గ్రంథము లన్నింటిని కవి తన చివర కృతియైన శేషధర్మమున పేర్కొనినాడు. భావిపరిశోధనమున ఆ గ్రంథములు లభించవచ్చునను యాశ యున్నది.

మల్లారెడ్డిదేశాయి అనునతడు గంగాపుర మహాత్మ్యము రచించెను. 1900 ప్రాంతమువాడు. అతడేవంశము వాడో-ఏప్రాంతమున రాజ్యాధికారము నెరపెనో మాత్రము తెలియదు.

సమగ్రమైన ఆంధ్రదేశ చరిత్ర ఇంకను మనకేర్పడ లేదు. చరిత్రకెక్కని రెడ్డిరాజులు, సామంతులు, దండ నాథులు ఎందరుండిరో!- వారిచేత ఆదరింపబడి కృతులను వెలయించిన కవిపండితు లెందరుండిరో? పరిశోధనమువలన తేలవలసిన విషయములివి. అప్పుడప్పుడు-అచ్చటచ్చట ఆంధ్రదేశమున, రాజకీయముగా అధికారము నెరపిన రెడ్డి వంశజులు ఆంధ్రవాఙ్మయమును శక్తివంచనలేకుండ పోషించిరి. రెడ్డిరాజన్యుల కాలమున ఆంధ్రదేశమున నొక అద్వితీయమైన తేజము ప్రసరించినది. రాజాశ్రయము కారణముగా ఆంధ్రి నాడొక వింతసోయగ మలవరుచుకొన్నది. రాజగౌరవమువలన, ఆంధ్రభాషా వాఙ్మయములకు నూతన వికాస పరిణామములు నాడు కలిగినవి. ఆ వికాసపరిణామములే అచ్చమైన ప్రబంధకవితకు నాందీ ప్రస్తావనలైనవి. అద్దంకి, కొండవీడు, రాజమహేంద్రవరములను పాలించిన రెడ్డిరాజుల అడుగుజాడలలోనే తరువాత సామంతులుగానున్న రెడ్లు నడచిరి. చాలమంది రెడ్డిరాజులు శైవులు, కవులు శైవులు, ప్రజలు శైవులు, వీరశైవులు మాత్రము గాదు. కనుకనే వేషమతగ్రంథములను ఆ కాలమున నుద్భవించినవి. కాకతీయులలో లేని పరమతసహనము రెడ్లలో

మన్నది. వెనుకటి చరిత్రను అర్థముచేసికొని, దాని నూతగా కొని, సత్పథమున ముందు కడుగిడుటలో రెడ్డిరాజు లద్వితీయులు. రెడ్డివంశమునకు శైవమువలెనే బ్రాహ్మణభక్తియు మొదటినుండియు అంటిపెట్టుకొనియున్నది. భారతదేశ చరిత్రలో, రెడ్డిరాజులకుండిన బ్రాహ్మణభక్తి వేరుచోట కానవచ్చునో లేదో అత్యంత సంశయమేనని శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు వ్రాసినారు. ఆ రెడ్డిరాజుల యాస్థానములు కవులతోను, పండితులతోను, గాయకులతోను, శిల్పులతోడను నిత్యకల్యాణము పచ్చతోరణమై కళకళలాడుచుండెడివి. ఆంధ్రదేశమున లలితకళలకు రెడ్డిరాజులిచ్చిన దోహదము మరపునకురానిది. కళల నెట్లాదరించిరో సామాన్య ప్రజాజీవితమును అట్లే ఉన్నతస్థితిలో నుంచిరి.

ఇప్పటికి జరిగిన పరిశోధనలనుబట్టి, రెడ్డిరాజులచేత పోషింపబడిన కవి పండితులసంఖ్య (సుమారు) 20. పదిమంది రెడ్డిరాజులు స్వయముగ పండితులు; కవులు; బహుగ్రంథకర్తలు. కృతిభర్తలైన రాజులసంఖ్య 13. ఈ రాజులకు మంత్రులైన వారిలో నిరువురును, ఆశ్రితులలో నొకడును గూడ కృతిభర్తలైరి. రెడ్డిరాజులును, వారిచేత పోషింపబడిన కవులును వ్రాసిన గ్రంథములు ఏబదికిపైగా నున్నవి. అందు ముప్పదికి పైగా ఆంధ్రగ్రంథములు. ఇతిహాసములు, పురాణములు, కావ్యములు, ప్రబంధములు, నాటకములు, వ్యాఖ్యలు, అలంకార శాస్త్రములు, ఇత్యాది వాఙ్మయ శాఖలన్నియు రెడ్డిరాజుల పోషణ

నను, కృషివలనను ఆనా డభివృద్ధియైనవి. ఎనలేని విధమున ఆంధ్రవాఙ్మయమును పోషించి రెడ్డిరాజులు కీర్తిశేషులై నిలచినారు.

# ఋష్యశృంగర్షి

## నన్నయ్య - విశ్వనాథ

ఋశ్యశృంగర్షి కథ రామాయణమున నున్నది. భారతముననను నున్నది. రామాయణమునకు ఋశ్యశృంగునితో గల దగ్గర తనము భారతమునకు లేదు. భారతమున ఋశ్యశృంగుని వృత్తాంతము ప్రాసగింకముగ చెప్పబడినది. రామాయణమున ప్రధాన కథాసంబంధిగా చెప్పబడినది. ఋశ్యశృంగుడు లేనిచో రామాయణము లేదు. అతడు లేకపోయినను భారతముండును. రాముడు లేనిచో రామాయణము లేదు. దశరథుడు పుత్రకామేష్టిచేయనిచో రామావతారముండదు. ఋశ్యశృంగుడు లేనిచో పుత్రకామేష్టియే యుండదు. మరొకరు ఋత్విజులుగా నుండిన ఇష్టి కాదాయనిన అగును. ఇష్టియగుట గాదు ముఖ్యము. దశరథుడందువలన సంతానవంతుడగుట ముఖ్యము. ఇదియే ముఖ్యమైనచో ఆ యజ్ఞమును ఋశ్యశృంగుడే నిర్వహించవలయును. ఇది దేవ రహస్యము. కనుకనే ఇతడు లేనిచో రామాయణమే లేదని చెప్పుట. భారత కథావిధానము వేరు. కాలకర్మ ప్రభావములకు లోనైన ధర్మరాజు వనములందుండి, కాలము వెళ్ళబుచ్చుకొనుటకు తనకు కనిపించిన బృహదశ్వ, నారద, రోమశ, మార్కండేయాదుల నేవేని కథలు చెప్పవలసినదిగా కోరును. ఉత్తమ పురుషులకథలు,

ధర్మ సూక్ష్మములు వినుట ఉభయతారకమని వానిని విని పింపవలసినదిగా కోరును. ఆ ఋషులు చెప్పుదురు. రోమ శుడీ ఋశ్యశృంగుని కథను ధర్మరాజునకు చెప్పినాడు. అగస్త్యోదంతము, గంగావతరణము, హేమకూటమాహాత్మ్యము చెప్పుచు నడచుచు నల్లదె ఋశ్యశృంగుడను ముని ప్రహదమని చెప్పినాడు. ధర్మరాజా కథ చెప్పవలసినదిగా కోరినాడు. రోమశుడు చెప్పినాడు. ధర్మజు డూకొట్టినాడు. అంతవరకే ఆ కథకు భారతమున గల ప్రాధాన్యము. భారతమున ప్రధానేతివృత్తము దీనివలన మారుటగాని—సాగుటగాని ఏమియు లేదు. కనుకనే ఋశ్యశృంగుడు లేకపోయినను భారత ముండునని చెప్పుట.

వ్యాస వాల్మీకులతో నీ వ్యాసమునకు సంబంధము లేదు. భారతమును నన్నయ వ్రాసినాడు. రామాయణమును చాలమంది వ్రాసిరి. రంగనాథ, భాస్కర, రఘునాథులు ముఖ్యులు. నవ్యులలో నొకరు భారతమును, ఒకరు రామాయణమును వ్రాసిరి. భారత కర్తయైన నవ్యునితో మనకు నిమిత్తములేదు. రామాయణ కర్తయైన నవ్యుడు విశ్వనాథ. ఈయనచే వ్రాయబడిన ఋశ్యశృంగుని కథను వెనుకటి వారి కథలతో పోల్చిచూచి గుణ నిర్ణయము చేయుటకే వ్యాస ముద్దిష్టము. నన్నయ విశ్వనాథులను పోల్చుటయనగా రంగనాథాదులను సందర్భానుసారముగ పేర్కొనుచు పోల్చుటయని గ్రహింపవలయును. నన్నయతో విశ్వనాథకు తాదాత్మ్యమున్నది. పురాణమహాకవు లందరితోడను నున్నది. ఇది మహాకవి లక్షణము. నన్నయ

విద్యాదయితుడు. విశ్వనాథ కవితారూప తపస్సమాధి గత చేతస్కుడు. అతడు గాఢ ప్రతిభుడు. ఇతడు ప్రోవా సర్వ కవిత్వ మర్మ విదుడు. అతడు నానారుచిరార్థ సూక్తి నిధి. ఇతడు బ్రాహ్మీమయమూర్తి. ప్రసన్న కథా కలితార్థ యుక్తి నన్నయది. కథాకథన శిల్పానేక మార్గాభిరాను వేతృత్వము విశ్వనాథది. కనుకనే నన్నయతో విశ్వనాథను పోల్చి చూడవలసి యున్నది. రంగనాథాదులు విశ్వనాథ వ్రాసిన ఒక్క కథను మాత్రమే గాక, ఆగంథమును సర్వమును వ్రాసిరి. పూర్వ రామాయణ కర్తలలో వారు శ్రేష్ఠులు. పూర్వ కవీంద్రుల కావ్య ప్రపంచమును క్రాంత దర్శిత్వమున దర్శించుట—పరిశీలించుట చేయగలవాడు కవియగుచో అతడు మహాకవి యగును. విశ్వనాథ అట్టివాడు. కనుకనే వారితో పోల్చదగినవాడు. ఆ పోల్చుటకే ఋశ్యశృంగుని కథను గ్రహించుట.

నన్నయ ఈకథను 29 గద్యపద్యములలో వ్రాసెను. రంగనాథుడు 86 ద్విపదలలో వ్రాసెను. భాస్కరుడు (మల్లికార్జునభట్టు) 32 గద్యపద్యములలో వ్రాసెను. రఘునాథుడు 110 గద్యపద్యములలో వ్రాసెను. విశ్వనాథ 54 గద్యపద్యములలో వ్రాసెను. అందరికంటెను తక్కువ మాటలలో ఋశ్యశృంగుని ఉదంతమును చెప్పినది నన్నయ. ఋషులు ఎక్కువ యర్థమును తక్కువమాటలలో చెప్పుదురు. నన్నయ ఋషివంటివాడు. అదియునుగాక భారతమున నాకథ కంతకంటె యెక్కువమాటలలో చెప్పరాదు.

ప్రాసంగికముగ వచ్చిన కథయది. నాలుగైదు విషయముల నూహించుట కవకాశము కల్పించుచు నొక విషయమును చెప్పుట నన్నయ కథాకథనములోనియొక శిల్పము. కనుక, నన్నయ తక్కువగనే వ్రాయును. రఘునాథు డందరి కంటెను యెక్కువమాటలలో వ్రాసెను. అతడు దక్షిణాంధ్ర యుగకవి. ఆ యుగమున వర్ణన లెక్కువ. వాచ్య మెక్కువ. వ్యంగ్య విభవ శిల్పము తక్కువ. కనుక రఘునాథుడట్లు వ్రాసెను. రంగనాథునికంటె మల్లికార్జునభట్టు ఉత్తమకవి. కథను స్వయం సంపూర్ణముచేసి కథన శిల్పమును ప్రదర్శించుటలో మల్లికార్జునభట్టుకంటె విశ్వనాథ గొప్పవాడు. ఈ విషయమున విశ్వనాథ నన్నయవంటి వాడు. కనుకనే నన్నయ విశ్వనాథలను పోల్చవలసి వచ్చినది.

రామాయణమునకు ఋశ్యశృంగునకు త్రెంచరాని విడదీయరాని సంబంధమున్నది. వనముల బడియున్న ఋశ్యశృంగుని దేశములోనికి తెచ్చినవాడు రోమపాదుడు. ఒక హేతువును పురస్కరించుకొని తెచ్చినాడు. అనగా తెప్పించినా డనుట. ఆ హేతువును ముందు సుస్పష్టము చేయుట కథను స్వయం సంపూర్ణము చేయుట. ఆ పని చేయుట రామాయణమున కొక క్రొత్త బిగువు దెచ్చుట. భారతమునన్టు చేయనక్కరలేదు, సూచించిన చాలును. నన్నయ అట్లే చేసెను. విశ్వనాథ అవసరమును గ్రహించి బిగువు కూర్చెను. పూర్వరామాయణ కర్తలలో ఒక్క రఘునాథుడు మాత్రము స్పష్టముగా నా హేతువును

చిత్రించినాడు. అనావృష్టి హేతువు. తత్ఫలితమును వర్ణించుటవలన రఘునాథుని చిత్రణము రక్తిగట్టినది. విశ్వనాథయు వర్ణించినాడు. రఘునాథుడా వర్ణనమునకు గీతమొకటి, కందమొకటి, సీసమొకటి వాడినాడు. విశ్వనాథ ఒక ఉత్పలము—ఒక సీసము వాడినాడు. ఇరువురభావనయు దాదాపు నొకటిగనే యున్నది. భావన యొకటియైనను కథన శిల్పము భిన్నమగుటవలన విశ్వనాథదిపై చేయియైనది. అనావృష్టియు, తత్ఫలితమును రోమపాదుడే పురోహిత బ్రాహ్మణులతో చెప్పినట్లుగా వర్ణించినాడు రఘునాథుడు. సుమంత్రుడు దశరథునకు చెప్పినట్లుగా వర్ణించినాడు విశ్వనాథ. ఇందొక విశేషమున్నది. పురోహిత బ్రాహ్మణులకు అనావృష్టియు, తత్ఫలితమును తెలియును. తెలిసినవారికి తిరిగి విషయమును వివరించుటలో వాస్తవికత యుండిన నుండవచ్చునుగాని శిల్పము లేదు. అనావృష్టివలని ఫలితములు దశరథునకు మాత్రము తెలియవా? అట్టిచో సుమంత్రుడు దశరథునకు చెప్పినట్లుగా వర్ణించుటలో మాత్రము విశేషమేమి? అని అడుగవచ్చును. నిజమే. కనులముందు జరుగుచున్న విషయమును వివరించుటలోకంటె, తెలిసినదయినను ఎన్నడో జరిగిన విషయమును చెప్పుటలో నొక విశేషమున్నది. గదా? దానినే విశ్వనాథ సాధించినాడు. ఇది మాత్రమేగాక మరొక రమణీయమైన కల్పన చేయుటవలన విశ్వనాథదైన పై చేయి సవిశేషమైనది. ధర్మము రాజానుమతము. ధర్మహానివలన అనావృష్టియైనది. తత్ఫలిత మెంతవరకు పోయి

నదనగా "పాడియావుల చన్నులుపట నెత్తుధారలోడు" వరకు పోయినది. అధర్మవిజయమును సూచించుటకు భారతీయుల కింతకంటె కొలమానము లేదు. నాలుగైదు దినము లన్నము లేక పోయినను భారతీయాత్మ నిమ్మళము గనే యుండును. గోవు లే మాత్ర మస్వస్థములైనను అది కలగుండు గొనును. హాహారవము చేయును. అంగదేశ ప్రజాహృదయ మట్లు చేసినది. రాజు మొగసాల నిలిచి చేసినది. అపుడు రాజేమి చేయును? చేయవలయును? అనావృష్టి అంతకు పూర్వము చాలకాలమునుండియు నున్నది. తన్నివారణోపాయము రోమపాదు డాలోచించుచునే యున్నాడు. అనావృష్టి వలని ఫలితములను ప్రజ లనుభవించుచునే యున్నారు. సహించుచునే యున్నారు. ఆవులు నెత్తు లోడుటతో, కలతపడి ప్రజాహృదయము హాహారవము చేసినది. దానిని రాజు చూచినాడు. మాటాడలేక పోయినాడు. దైన్యము వేయి మానవాకృతులతో ప్రత్యక్షమైనట్లున్న ఆ ప్రజా సమూహమును చూచి రాజును దైన్యపడినాడు. ఏడ్చుచు వారిని చేవిసగి పంపినాడు. పురోహితులను మంత్రులను కనుగొని "పాప ముర్వీపతిది. వికృతపు బాములు ప్రజలవి. ఈ యనావృష్టి కే ప్రాయశ్చిత్తమో చెప్పుడు. అదియు శీఘ్రమేను గావించెదను" అని ప్రలాపించుచు నడిగినాడు. అతః పూర్వమట్లు వారి నడుగలేదు. అడుగకపోయినను చెప్పవచ్చును గదా యనిన ఆ మార్గము దుర్ఘటమనియు,

చేయనసాధ్యమనియు వారు చెప్పలేదు. ప్రస్తుతము రాజు ఆ ప్రాయశ్చిత్తమెట్టి దుర్ఘటమును, అసాధ్యమును నైనను చేయుటకు నిశ్చయించుకొనినాడు. నిశ్చయము వ్యక్తమైనది. ద్విజులు మార్గము నుపదేశించినారు. రోమపాదుని గూర్చి యింత వ్రాయుట కథను స్వయం సంపూర్ణము చేయుట. నన్నయ భారతమున నెంత వ్రాయుట అవసరమో అంత వ్రాసినాడు. విశ్వనాథ రామాయణమున నెంత వ్రాయుట అవసరమో అంత వ్రాసినాడు. భారతమున ఋశ్యశృంగునకే ప్రవేశమున్నది గాని రోమపాదునకు లేదు. కనుక నన్నయ ఒక గీతము, మూడు పాదముల వచనముతో రోమపాదుని స్థితి యెరుక పరచి వదలినాడు. భాస్కర రంగనాథులకంటె రామాయణ కథా హృదయమును రఘునాథుడు కొంచె మధికముగా నర్థము చేసికొనినాడు కాని, తరచు అనౌచిత్యమునకు పాలుపడుట హేతువుగా వారి ముందు నిలువజాలక పోయినాడు. అనౌచిత్యములను సాధ్యమైనంతవరకు పరిహరించుచు, గాఢమైన ప్రతిభ కలిగి, రామాయణ కావ్యాత్మతో పూర్వులకంటె అధికముగా తాదాత్మ్యమును చెందుటకు శక్తుడైన విశ్వనాథ ఇంతవరకు వచ్చిన రామాయణ కర్తలలో శ్రేష్ఠుడు. రంగనాథుడు భాస్కరునకు చాలడు, రఘునాథ రామాయణమంతయు లభింపకపోవుట, లభించినదానిలో అనౌచిత్యపు పాలధికముగా నుండుట కారణములుగా రఘునాథుడు పైవారికి తీసికట్టు. పూర్వ రామాయణములలో ఒక్క భాస్కరరామాయణమే విశ్వనాథరామాయణముతో

పోల్పించుకొనుటకు శక్తమైనది. కథా కథనమునను, పాత్ర చిత్రణమునను — మనస్తత్త్వ నిరూపణమునను విశ్వనాథ కుశలుడగుటవలన తరచు భాస్కరునికంటె పైచేయిగా కనుపించును.

అనావృష్టిదోషము నపనయించు మార్గమును ద్విజులు రోమపాదునకు చెప్పిరి. ఋశ్యశృంగర్షి అంగదేశమున అడుగిడినచో వర్షము కురియునని చెప్పిరి. ఆమాట విని రాజు "మీరు వేగనని యామునిపుంగవుఁదెండు" అనినాడనియు, "ఏము చాల మస్వరమ తపోధనోత్తముని పాలికిఁ గాంతల బంపు"మని వారు ప్రత్యుత్తర మిచ్చినారనియు, అంత జనపతి వారస్త్రీలను రావించి "మీరు చతురతతోడం జని ఋశ్యశృంగుఁ గొనిరండు" అనినాడనియు భాస్కరుడు వ్రాసినాడు. "మునినాథు నగరికేరీతి రావింతునని విచారము చేసి మంత్రులఁ బిలచి మునులను రప్పించి యడుగ "వారకాంతలఁ బపు" డని వారు చెప్పినట్లును తరువాత రాజు వారస్త్రీలను పిలిచి చెప్పి పంపినాడనియు రంగనాథుడు వ్రాసినాడు. రఘునాథుడు భాస్కరునివలెనె వ్రాసినాడు. బ్రాహ్మణులవలన విషయము నెరిగి బుద్ధిమంతులతో విచారించి విదగ్ధవేశ్యాంగనలను, బిలువనంపి, చెప్పి, పంపినట్లు నన్నయ వ్రాసినాడు. అందరును వేశ్యలనే పంపించిరి. విశ్వనాథయు వేశ్యలనే పంపెను. ఉచితమును చమత్కారమును నైన నొకల్పనచేసి పంపెను. మంత్రులతో విచారించి యదికాదని యిదికాదని పెక్కు ఆలోచనలు త్రోసిపుచ్చి దారి తోఁచకయున్న సమయమున

వింజామరలు వీచు వారయువతులు నలువురు తమలో తాము కన్నులుపుకొని ప్రభువులు తాంబూలంబు దయ సేయించినచో పోయి ఆ ఋశ్యశృంగుని దెత్తుమనిరి. రాజు వారిని పంపెను. ఇట్లు సన్నివేశమును కల్పించుటలో విశేషమున్నది. ఋశ్యశృంగుని వృత్తాంతమును పురోహితులు రాజునకు చెప్పుచుండగా వారస్త్రీలు వినినారు. అతడు స్త్రీ పురుష భేదము నెరుగనివాడని వారి మాటల వలన వ్యక్తమైనది. అట్టి వానిని చూడవలయునన్న ఒక ఉబలాటము కలుగుటతగును. వారకాంతల కది కలిగినది. అతనిని చూచి వచ్చుట రాజుగారి ప్రయోజనమును చేయుటగాదు, అతనిని గొని తేవలయును. స్త్రీ స్పర్శ నెరుగక ముక్కు మూసికొని యున్నవారి నెందరను తమజాతి వెంటబడి తిరుగునట్లు చేసికొనలేదు? అట్టివారిని వశము చేసికొనుట యనునది వారస్త్రీ జాతికి గౌరవాపాదకమే యగును. అది వారి జాణతనమునకు, రాసిక్యమునకును నిదర్శనము. అట్టిచో స్త్రీ పురుష భేదమెరుగని వానిని వశము చేసికొని వెంటపడవేసికొనుట తమ జాతిలో తమ్ము తామున్నత స్థితిలో నుంచుకొనుట. అందులకు వా రుత్సహించిరి. "అతనికి లోకమే తెలియదు. స్త్రీ పురుష భేదము కూడ నెఱుంగ"డని పురోహితులు రాజుతో చెప్పినప్పుడే వారి కాయుత్సాహము కలిగినది. తరువాత మంత్రులతో నాలోచించి ఆలోచించి "అనావృష్టిచే జెడియున్ మృత్యువు వద్ద నుండియు మునిం జేరన్ భయం బంట" అని రాజు ఒక దీర్ఘ నిశ్వాసము విడచు వరకు, వారస్త్రీల యుత్సాహము

ద్విగుణమై త్రిగుణమై లోపల నిముడక హృదయమును భేదించుకొని వచ్చునంత యైనది. అట్లే వచ్చినది. ఇంత యుత్సాహము, పట్టుదల పూర్వ రామాయణములలోని వేశ్యలకు లేదు. ఉండుట కవకాశము లేదు కనుక లేదు. రాజు వేశ్యలను పిలిపించి చెప్పి పంపుటకంటె వారే ముందుకు వచ్చి తాముపోయి తెచ్చెదమనుటలో గుణమున్నది. క్రొత్తగా రాజుచేత పిలిపింపబడి వచ్చినవారికి ఋశ్యశృంగుని యుదంతము తెలియదు. రాజుగాని, తదితరులుగాని వారి కాతని విషయము చెప్పినట్లు పూర్వరామాయణ కర్తలు వ్రాయలేదు. అందువలన పూర్వరామాయణముల లోని వేశ్యలు ఋశ్యశృంగుని యాశ్రమ ప్రాంతములకు వెళ్ళుట—ఋశ్యశృంగుని గుర్తించుట — ఇత్యాదులెట్లు పొసగినవను ప్రశ్నములకు సమాధానము లంత తృప్తికరముగా నిచ్చుటకు వీలుపడదు. భాస్కరుడు మాత్రము చమత్కరించి ఒక సమాధానమును చెప్పినాడు. ఋశ్యశృంగుడు మెలగెడు వృక్షవాటి చెంతల వారస్త్రీలు నిలిచియున్న సమయమున నొక ఋషి యటవచ్చిన "ఓ మునిపుత్ర యేల యొక్కరుఁడవుఁ జొచ్చి యీ విజన కానన భూమిఁ జరించెదు" వని వారడిగినట్లును దానికి సమాధానముగా నతడు ఋశ్యశృంగుడనువాడ నని తన యుదంతము చెప్పినాడట. అందువలన వేశ్యలు తమ కౌశలమున జూపుటకుపక్రమించినారట. ఇది భాస్కరుని కల్పన. రంగనాథునకీ సందేహము కలగలేదు. సమాధానము వ్రాయలేదు.

రఘునాథుని వేశ్యలు సుపరిచితమైన స్థలమును ప్రవేశించి నట్లు ఋశ్యశృంగుని యాశ్రమమును ప్రవేశించిరి. తప్పటడుగులు వేయుటలో రంగనాథ, రఘునాథు లొకరి నొకరు మించిరి. నన్నయ తానొక చమత్కారము చేసెను. తాను పంపిన విదగ్ధ వేశ్యాంగనలలో నొక జరద్వేశ్యను గూడ నుంచెను. అది ఆరితేరిన గడుసరి. విభాండకుడు వన్యఫలాహరణార్థము వనమునకరిగిన యవసరము గుర్తించి అభినవయౌవన విలాస విభాసినియైన తన కూతు నా ముని పుత్రునిపాలికి పంపినదట. ఇది నన్నయ పద్ధతి. విశ్వనాథుని వేశ్యలు ఋశ్యశృంగుని కథను వినిరి. కావలెనని విశ్వనాథ వినుపింప లేదు. అట్లు కలిసి వచ్చినది. "ఆ జనకుండు పుత్రవిరహంబు సహింపఁడు. విభాండకున్ మొఱఁగి రావలె. లేవలెఁ 'గుజ్జమాని' ననుమాటలను గూడ వారు వినిరి. కనుక జాగరూకులై తాము మెలగవలసి యున్నదను విషయము విశ్వనాథ రామాయణములోని వేశ్యలకు తెలియును. కనుకనే వారు "విభాండకుని యాశ్రమంబున కుల్లయగు ప్రదేశంబున బండ్లు దిగి యందు విడిసి" ఋశ్యశృంగుని రాకకై ఎదురుతెన్నులు చూచుచుండిరి. ఒకనాడు ఋశ్యశృంగుడు వచ్చినాడు.

రంగనాథ, రఘునాథుల వేశ్యలకు విభాండకుని గూర్చిన జ్ఞానమున్నట్లే లేదు. విభాండకుని యాలోచన లేక యాశ్రమమును ప్రవేశించుటవలన సమయమున కతడచటనే యున్నచో శపింపకపోడు. అపుడు వారు వచ్చిన కార్యము సాధ్యముగాదు. స్త్రీలను స్త్రీలుగా గుర్తించగల

జ్ఞానము విభాండకున కున్నది. కనుక ఆతఁడున్నచో కుపితుడై శపించుట యనివార్యము. ఋశ్యశృంగుడని తెలిసికొనినతరువాతనే భాస్కరుని వేశ్యలు ప్రసంగమునకు దిగిరి. కనుక ఇట విభాండకుని శాపప్రసక్తి లేదు. నన్నయగారి జరద్వేశ్య, విభాండకుఁడు లేని సమయముచూచి, తన కూతు నా ఋశ్యశృంగుని పాలికి పంపినది. విశ్వనాథుని వేశ్యల నుల్లయగు ప్రదేశమున నుంచినాడు. అటునిటు తిరుగాడుచు ఋష్యశృంగు డటకు రావచ్చును. విభాండకుఁడు గూడ రావచ్చును గదా! అట్టిచో నాతఁడు వారిని శపింపక పోవునా యనిన, దూరముగా నున్నవారిని, పాంథులను, స్త్రీలను, అత డూరక ఏల శపించును? అతఁడు వచ్చినపుడు వీరు హావభావ విలాసము లేల ప్రదర్శింతురు? ఋష్యశృంగుఁడు వచ్చినపుడు తామవన్నియు ప్రదర్శింప వలయునుగదా, ఆతనిని గుర్తుపట్టుట ఎట్లు? ఆతని కథ వారికి తెలియునుగదా? అతనికి స్త్రీ పురుష భేదజ్ఞానము లేదు. తనకంటె భిన్నమైన యాకృతి ప్రవృత్తి కలిగి తనవలెనె యున్నవారు కనిపించినచో మానిసి ఎంత వింతగా చూచును. వింతదనము, ఋష్యశృంగు డటకు వచ్చినపుడు కప్పిపుచ్చుకొనలేదు. దానినిబట్టియే గ్రహింప వచ్చును. విభాండకున కట్టి ప్రవృత్తియుండదు. కనుకనే వేశ్య లుల్లయగు ప్రదేశమున దిగినారని విశ్వనాథ వ్రాయుట.

యదృచ్ఛాగమనంబున నొకనాడు ఋశ్యశృంగుఁడు వేశ్యలు విడిసియున్న కాంతారాభిముఖుఁడై వచ్చినాడు.

వారు చూచిరి. వీణయు, మృదంగమును, తాళములును మ్రోయించిరి. నాయకురాలు గొంతెత్తి కృతులు వర్ణములు పాడినది. వేశ్యలు గానము చేసినట్లు రంగనాథుడు, భాస్కరుడు వ్రాసిరి. రఘునాథుడట్లు వ్రాయలేదు. నన్నయ, ఋష్యశృంగుని చేరిన వేశ్య "ముని ముందటం గంమకనర్తన మృదుగీతములయందుఁ దన కౌశలమెల్లను జూపి, విరచితాలింగనయై, మునిపతికి ముదము గావించెనది" నని వ్రాసినాడు. విశ్వనాథ, భరతశాస్త్ర సరణిని బాడిన యీ పాటలు వినిన ఋశ్యశృంగునిలో కలిగిన అంతరములయిన మార్పులను వర్ణించెను. ఇది పూర్వకవు లెవ్వరును చేయనిపని. మానవజీవితముపై గానకళా ప్రభావమెంత యుండునో ఈ ఘట్టమున విశ్వనాథ నిరూపించినాడు. సంగీతము మానవుని ఎంత చైతన్యవంతునిగా చేయగలదో అంత చేసిన దా వేశ్యల సంగీత మాఋష్యశృంగుని. గానము చేసినారని చెప్పుటలో లేదు గొప్పతనము, దాని ప్రభావమును. తత్ఫలితమును చెప్పగలుగుటలో నున్నది. అదియే విశ్వనాథ చెప్పినాడు. ఆ గానము వినుచున్న ఋష్యశృంగునకు "తన యాత్మఁ దానెరుంగని యొక్క యానందపరిధి రేఖాస్వయం వ్యక్తి కలిగి మైగగుర్పొడిచి వెనుకటి బిగువు చెడి క్రొత్తబిగువులను దెచ్చుకొని"నదట. కనులువిచ్చి చూచుచు నిలువబడిపోయినాడు ఋశ్యశృంగుడు. అంత వారు నృత్యముచేసిరి. నాలుగం బుధులవోలె చేసిరి. నర్తన కళా ప్రదర్శనమునుగూడ చేసి వారనిమాత్రము రంగనాథుడు వ్రాసినాడు. కేవలము

న_ర్తనము చేసినారని గాక ఎట్లు చేసినదియు విశ్వనాథ వ్రాసినాడు. నాట్యశాస్త్రముతో వానికిగల పరిచయమున కిది నిదర్శనము. ఉచితస్థలమున శాస్త్రపాండిత్యమును ప్రదర్శించుటను మహాకవులు చేయుదురు. విశ్వనాథ ఆ కోవ లోనివాడు. సంగీతము, నృత్యమును, 'విని విని, చూచి చూచి కనువేదుఱు తీరఁగ వారిఁజేరినాడు ఋశ్యశృంగుడు. కనులు చెవులు సుతర్పితముగా నొనరించినారని వారల పొగడి, ఆనందాతిశయమున వారిని అల్లనల్లన స్పృశించి కౌగిలించుకొనినాడు. ఒక తెలియఁగరాని సుఖానుభూతికి లోనయినాడు. పూర్వ రామాయణములలో కౌగిలి ప్రసక్తి లేదు. 'ఒడలెంతయుఁ బులకింపఁగఁ పుడికి'నారని మాత్రం వేశ్యలనుగూర్చి భాస్కరుడు వ్రాసెను. ఆలింగన ప్రస్తావన భారతమున నున్నది. భాస్కరుడు-మఱువాడు వచ్చినపుడు వేశ్యలు వానిని పలుమాఱు కౌగిలించుకొని నారనినాడు. నన్నయ, విశ్వనాథ లిరువురును మొదటినాడే కౌగిలింతలు జరిపించిరి. నన్నయ ఋశ్యశృంగుని వేశ్యయే కౌగిలించు కొన్నది. విశ్వనాథ ఋశ్యశృంగుడు తానే వేశ్యలను కౌగిలించుకొనెను. ఈ విషయమున నన్నయ విశ్వనాథలకు భేదమున్నది. నన్నయ సంయమనమున కిచ్చిన ప్రాధాన్యము కళాప్రభావమున కీయలేదు. విశ్వనాథ కళాప్రభావము సంయమనమును లోగొనగలదని నిరూపించినాడు. నన్నయ వ్రాసినది కావ్యముగాదు. కావ్యత్వము నిముడ్చుకొనిన ఇతిహాసము. విశ్వనాథ వ్రాసినది ఇతిహాసముగాదు.

ఇతిహాసరేఖల నిముడ్చుకొనిన కావ్యము. ఇది సర్వమును రసపర్యవసితము కావలయును. అందుకే నర్తన కళాసంగీత తతులను, వాని యథార్థ్య స్వరూపమును చిత్రించినాడు విశ్వనాథ. భారతమున సంయమనమునకు ప్రాధాన్య మున్నది కనుకనే, తరువాత విభాండకునితో ఋశ్యశృంగుడు జరిగిన వృత్తాంతమంతయు పూసగ్రుచ్చినట్లు తూచా తప్పకుండ చెప్పినట్లు నన్నయ వ్రాసినాడు. రామాయణ కర్త లెవరును ఈ పని చేయలేదు. చేయగూడదు గనుక చేయలేదు. చేయవలయును గనుక నన్నయ చేసినాడు. భారతములోని ఋశ్యశృంగునకు వేశ్య చూపిన కందుక నర్తన మృదుగీతములయందలి కౌశలమువలన ముదముగలిగినది. రామాయణమునందలి ఋశ్యశృంగునకు తన యాత్మైదానెలుగని ఒక ఆనందము కలిగినది. ముదమున కంటె ఆనందము గొప్పది. ఆనందము కలిగినది గనుకనే విశ్వనాథ ఋశ్యశృంగుడు వారిని తానుగా కౌగలించు కొనినాడు. భారతమున నన్నయ ఋశ్యశృంగరియందు నిగ్రహమును పరాకాష్ఠలో చూపినాడు. తన కౌశలము చూపి, విరచితాలింగనయైగాని భారతమున వేశ్య ముని పతికి ముదము గావించలేకపోయినది. అధికనిష్ఠాశీలుడైన ఋశ్యశృంగుని స్థితి భారతమున నన్నయ అట్లు చూపి నాడు. వేశ్యలను ఋషి కుమారులనియే రెండు గ్రంథముల లోని ఋశ్యశృండును తలచినాడు.కనుక రెండింటియందును కామవాంఛ రేఖామాత్రముగానైనను వాని హృదయ మున పొడగట్టలేదు. కళాప్రభావమునకు లొంగిన వానిగా

చిత్రించుట మూలముగా, కొందరు ఋశ్యశృంగునకు వేశ్య లయందు కామిక మేర్పడినదని తలతురేమోయని విశ్వనాథ, అంతగా వ్రాసియు చివరకు 'అసమశరుడు తొంగిచూడడు ముని ఋశ్యశృంగువంక' అని స్పష్టము చేసినాడు. అంత యానందమును గూర్చిన వారి యాశ్రమ భూము లోక మూఱు చూడవలయునన్న సాత్వికపు కోరిక మాత్రము కలిగినది ఋశ్యశృంగున కని విశ్వనాథ వ్రాసినాడు. చను దెంచిన 'తరుణి మునినందను చిత్తంబునకు వైకృతముం జేసె'నని మాత్రము నన్నయ వ్రాసెను. మఱునాడు ఋశ్య శృంగుడు వారి వద్దకేగెను. పోదమా యనిన పోదము పోద మనుచు నందరును కదలి అందరును అంగదేశము చేరిరి. అంతట వర్షము కురిసెను. అదివరకేమియు తెలియని ముని కుమారుడు అంగదేశ ప్రవేశ మాత్రమున సర్వమును గ్రహించెను. సహజబోధలు నిశ్చలతత్త్వమానసులని విశ్వ నాథ సమర్థన. నన్నయకూడ తన భారతమున నొక విషయ మును సమర్థించినాడు. అది విశ్వనాథ సమర్థించిన దాని కంటె భిన్నము. వేశ్యను మఱునాడు, ఋష్యశృంగు డను సరించుటను 'విలాసినుల సహాలాప సహాసన సహాయాన ములు బంధసమములు, అను సిద్ధాంతమును చూపి సమ ర్థించినాడు. ఇనుప కచ్చడాలు కట్టుకొనిన మునులను కూడ స్త్రీలమెయితావు గగుర్పొడించును. ఇక సామాన్యుల విష యము చెప్పవలసిన దేమి? అను విషయమును నిరూపించు టయే నన్నయ యుద్దేశము. తపస్సమాధిగతచేతస్కృత మానవుని అత్యున్నత స్థానమున నిలుపగలదని వైదికమైన

యభిప్రాయము. వేద తుల్యమైన భారతమును వ్రాయు నన్నయ కున్నదియు నదియే. 'సచ్చరిత్రంబైన తన యాశ్ర మంబువిడిచి మనుష్యయోగంబునం దగిలి యకార్యమలి పిఱుందన చని' యెనని ఋశ్యశృంగుని గూర్చి నన్నయ వ్రాయుటలో నర్థమదియే. వాస్తవమును చెప్పి అవసర మును నన్నయ సూచించినాడు. ఆ సూచనకే ఋశ్యశృం గుని కథను వ్రాసినాడు. ఋశ్యశృంగర్షి పట్ల పొడసూపిన వాస్తవిక విషయమే రామాయణమునకు ముఖ్యము. సాంసా రిక విషయ పరిజ్ఞానము ఋశ్యశృంగునకు కలిగినట్లు వ్రాయ వలసిన యవసరము భారత కర్తకు లేదు. ఆత్మసంయమన మును నిరంతరమును ఈషణత్రయము భేదించుటకే చూచు చుండును. కనీస మాజ్ఞానము లేని వానిని గూడ అవి లోగొనునని వ్రాయుట భారతికర్త చేయదగిన పని. దాని నే నన్నయ చేసినాడు. సాంసిద్ధికమైన సాంసారిక విషయ పరిజ్ఞానము కలుగుటయే రామాయణమునకు కావలయును. ఋశ్యశృంగున కది కలిగినది. దానిని విశ్వనాథ సమర్థిం చినాడు. ఉచితస్థలమున దేనిని సమర్థించుట యవసరమో దానిని సమర్థించుట మేధావంతులు చేయగలరు. నన్నయ విశ్వనాథ లట్టివారు. ఋశ్యశృంగుని ప్రవేశ పెట్టినప్పటి నుండియు నన్నయ నిగ్రహము వైపునకు ములు సూపిం చుచు నడిపించి నడిపించి చివరకు 'విలాసిలను.... బంధసమ ములు గావె, అను సూత్రమును వ్రాసి ఋశ్యశృంగుని వేశ్యవెంట పంపినాడు. విశ్వనాథ ఋశ్యశృంగుడు గాన మును వినుటకు ప్రారంభించి నప్పటినుండియు ఆ మహా

క్షిలో ఎక్కడనో, ఆయన లోతులందు, అంకురింపకయే చివికిపోయిన భావసముదాయము, ప్రాణము పోసికొని నెమ్మదిగా పైకివచ్చి, చివరికొక క్రొత్త బిగువు కూర్చుకుని, పూర్వ మననుభూతమైన ఒక ఆనందానుభూతిని అతనికి కలిగించినట్లుగా వ్రాసి, తరువాత నతడు వారిని కౌగలించుకొని మాటాడి, వారిచ్చిన భక్ష్యముల నారగించి, తదుపరి తన యాశ్రమమునకు పోయి 'దినముదినము నారేయును వారలఁగూర్చి యూహా లూహించుచు ప్రొద్దున లేచి, వేశ్యలున్న చోటకు వచ్చి వారితో కలిసి అంగదేశమునకు వచ్చినట్లు వ్రాసినాడు. నన్నయ ఋశ్యశృంగుని నొక మార్గమున నడిపించినాడు. విశ్వనాథ మఱొకట నడిపించిచాడు. నన్నయ దృష్టి సంయమనము మీద విశ్వనాథ దృష్టి సంసారము మీద భారతమునకు నన్నయ యవసరము. రామాయణమునకు విశ్వనాథ యవసరము. ఋశ్యశృంగుని సంసారము వైపు త్రిప్పుటకు విశ్వనాథ సంగీతమును సాధనముగా వాడినాడు. సంగీత శ్రవణ మాత్రమున మహర్షి యట్లు బిగువు చెడి లోబడునాయని ప్రశ్న. అట్లయినచో నాతని మహర్షిత్వము కుంటుపడిన యట్లే గదా! కొంచము కుంటు పడవలయును. అట్లు పడినపుడే భారత రామాయణకర్తల నిరూపణము రక్తికట్టును. సంగీత మట్టి ప్రభావమును చూపగలదని తులసీదాసు కూడ వ్రాసినాడు. సీతా రాముల కల్యాణసమయము నందలి గాన కళా ప్రదర్శనమునకు మహర్షులు, ధ్యానముద్ర విడిచి ఒక ఆనందము ననుభవించిరని తులసీదాసు వ్రాసినాడు. మహర్షుల

తపోభంగము చేయుటకు వచ్చిన స్త్రీ జనము గానకళా నర్తన ప్రదర్శనము మునుముందు చేసినట్లుగనే మన పూర్వ గ్రంథములు చెప్పుచున్నవి. కనుక గానకళకు సంయమి లోబడుట వింతగాదు.

విశ్వనాథ ప్రదర్శించిన కథాకథన శిల్పమును పూర్వులతో పోల్చి స్థూలముగ పైన నిరూపించితిని. ఋశ్య శృంగ పాత్ర విషయమున నన్నయ విశ్వనాథలకున్న దృష్టి భేదమును గూడ కొంత వ్రాసితిని. నన్నయ విశ్వనాథలలో నున్న ఈ రెండు విశేషములు భాస్కరాదులలో లేవు. నన్నయకు లేని యవసరము విశ్వనాథ కున్నందున కథను స్వయం సంపూర్ణము చేసినాడీతడు. ఆ చేయుటలో రోమ పాదుని పూర్తి మూర్తిని చిత్రించుట యొకటిగా వెనుక నిరూపించితిని. ఇక వేశ్యల పాత్రములున్నవి. వారి విష యము వ్రాసినగాని ఈ వ్యాసము సంపూర్ణము గాదు.

విశ్వనాథ, రాజునకు వింజామరలు వీచుచున్న వేశ్య లతో రంగము ప్రారంభించెను. వారు నలువురు. కుసుమ శరకోదండల స్తకమధ్యలు, తత్కార్ముక భ్రూయుగలు, తజ్జ్యాతనూలతలు—అగు వారియువతులు నలువురని వ్రాసి నాడు. నలువురకును మూడు విశేషణములు వాడినాడు. నలువురకును నాలుగు వాడవచ్చును గదా—వాడలేదు. అందరి మధ్యములు, అందరి భ్రూవల్లులు, అందరి తనూ లతలు కూడ కుసుమశరకోదండుని లస్తకమును వలెను, కార్ముకమును వలెను, జ్యావలెను నున్నవట. ఇందొక విశే షమున్నది. అందరును అన్నింటివలె నున్నను, ఒకొక్కరి

యందు ఒక్కొక్క గుణము త్రిగుణమై యున్నది. మరి నాల్గవదాని మాట—చెప్పబడలేదు. మిగిలినవారి యందు వలెగాక ఈమెయందన్ని గుణములును మూర్తి గట్టుకొని యున్నవి. ఈమెయే నాయకురాలు. వీణయును, మృదంగమును, తాళములును మ్రోయించుటయే పై ముగ్గురపని. గొంతెత్తునది నాయకురాలు. ఈమెను, ఈమెపాటను చూచుటనే, వినుటనె మును ముందామునిని బిగువు చెడినాడు. ఆ ముగ్గురయందు కంటె నాయకురాలి యందొక విశేష ముండవలెననే, విశ్వనాథ ఆమెకు ప్రత్యేకముగా నొక విశేషణము వాడలేదు. సూచించినాడు. రాజుతో మాటాడినది నాయకురాలు. ఆమె గడుసరియట. కనుకనే "మానీంద్రున్ గొని మమతం దెత్తున్, తేనుంజాలక ధృతి రానే, రానీపట్టణ రమ సిగ్గిల్లిన్" అని 'పణవము' కొట్టి చెప్పినది. ఆ గడుసరి తనమునకు రోమపాదు డచ్చెరు వడి "ముని శాపభీతి మీకు లేదా భీతహరిణ నేత్రలార! యన లవిత్రముల్ వోని చూపులు నిగుడ్చి మందముగ హసిం" చినారట వారస్త్రీలు. భీతహరిణ నేత్ర లారయని రాజన గానే లవిత్రముల్ వోని చూపుల నిగుడ్చి పైపెచ్చు మంద ముగా హసించినా రనుటలో నున్నది కవిత్వము. వ్యంగ్య వైభవవాసన యనగానది. హరిణ నేత్రము లందముగా నుండును. హరిణమునకు బిత్తరపోవు గుణ మొకటి సహజము. ఆ గుణము దాని నేత్రాపాంగములలో వ్యక్తమగు చుండును. అదియే ఆ నేత్రముల కందము. స్త్రీల కన్ను లట్లుండుననవి వర్ణించుట కవిలోక సామాన్యము. ఊరకే

హరిణము భీతిగొనును. నిజముగా భయమే సంభవించి నపుడు దాని కన్నులు చూడవలసినదేగాని చెప్పనలవి గాదు. రోమపాదుడా వేశ్యలను భీతహరిణ నేత్రలారయని సంబోధించినాడు. వారు రాజునకు పరిచారికలు. హరిణ నేత్రలైనవారు రాజుగారిని చూడగనే భీతహరిణ నేత్ర లగుట వారి కలవాటు. అది మర్యాద. అతఃపూర్వము రాజు వారి భీతహరిణ నేత్రములనే చూచినాడు. నేడు వారు తామగా ముందుకు వచ్చి ఋశ్యశృంగర్షిని గొని తెత్తుమనినారు. హితులు, పురోహితులు, మంత్రులు మునిని చేరుటకు భయపడుచుండగా వారు తెత్తుమని ముందుకు వచ్చినారు. రాజును కుచ్చెరువడినాడు. తాను ప్రతిదినమును చూచు భీతహరిణ నేత్రలేనా వీరు? అను సందేహము కలిగినది. భీతహరిణ నేత్రలుగా కనుపించు మీకు మునిశాపభీతి లేదేమి యనినాడు. అపుడు వారు భీత హరిణ నేత్రలు కారుగదా, హరిణనేత్రలు కూడ కాకుండ లవిత్రములవోని చూపులు నిగుడ్చిరి. ఈ హఠాత్సంభ వమునకు రాజచ్చెరువడి గ్రహించుకొనినాడు మా అసలు విషయము ప్రభువులకు దెలియదేమియని మందముగ హసించిరి. లవిత్రములు వోని చూపులు నిగుడ్చుట వారు నేర్చుకొనిరి. ఆ నేర్పునంతకు పూర్వము ప్రదర్శించవలసిన యవసర మేర్పడలేదు. భరతు నాగమమెల్లను ప్రయోగ వైఖరిందెచ్చిన వారువారు. ఆ చూపులు నిగుడ్చుట వారికొక లెక్కయా! అలవోకగా వారట్లుచూచిరి. ఆ చూపులు రాజునకు వారి గుండెనిబ్బరమును చూపినవి. రాజు వారి

నంపినాడు. విశ్వనాథ వ్రాసిన ఆ యాటవెలది పద్యము లోని ఆ రెండు వాక్యములలో నింత అర్థమున్నది. ఈ పద్ధతిని నన్నయ వ్రాయగలడు. లవిత్రములు వోని చూపులు వారు చూడగా వారి గుండెనిబ్బరమును తెలిసికొనుటయే గాదు రోమపాదుడు చేసినది, ఋశ్యశృంగుని తప్పక ఆ చూపులను మెడకు తగిలించి తీసికొని వత్తురు - అతడు వచ్చును-అని తాను ముందు గుండెనిబ్బరము చేసికొని నాడు. క్షణములో నింత వ్యవహారమును రెండు వాక్యములలో చెప్పి భాస్కరాది పూర్వ రామాయణ కర్తలను మించినాడు విశ్వనాథ.

వేశ్యలు బయలు దేరినారు. 'జాతినిగూడ మామ మెయిజాపు గగుర్పొడిపించు నీటులే చేతము గలువారి నిండె జెప్ప మటంచును గువ్వకోలుగా నవ్వు చంద్రుళ్లచు- మధ్యమధ్య- 'ఓసీ నవ్వొక్కవ నీకు' అని పరస్పర మనుకొనుచు బయలు దేరినారు. విభాండకుని, ఋశ్యశృంగుని తలచుకొనుచు వెళ్ళినారు. 'విభాండకున్ మొఱఁగి రావలె' నను వాక్యము వారు మరచిపోలేదు. కనుకనే మార్గమధ్యమున 'మాని కోపంబున నోసి మిమ్ము నెవరిందు పంపినారన్న భూవరుని చెప్పకుడు ఏమె వచ్చితి మన పాడో నో బీడో నో' అని యనుకొనినారు. ఇది వారి స్వామిభక్తికి నిదర్శనము. ఇట్టి సమయమునకు తప్ప వారు రాజునకు చేయు సాహాయ్యము మరియొకటి లేదు. ఇట్టి యవకాశములు మాత్రము తరచు వచ్చునా-? ఋశ్యశృంగుని గొని

తెచ్చుట కుపక్రమించుటలో వేశ్యల కుత్సాహముతో పాటు ప్రభు భక్తియు నిరూపించి విశ్వనాథ వారి కొక యున్నతి కలిగించినాడు. ఇంత ప్రభుభక్తి పరాయణలు గనుకనే, ఋశ్యశృంగుడు తమ్ము సమీపించి ఉరములు తాకుచు, పిరుదులు ముట్టుచున్న సమయమున 'భూపశ్రేష్ఠుని కూఁతు పెన్మిటనుచున్ బూజింతు రమ్మాని' నని విశ్వనాథ వ్రాయుట. సంగీత నర్తన కళా కౌశలము నెరపిన తరువాత ఋశ్యశృంగుడు వారిని సమీపించి యెన్నియో ప్రశ్నలడిగివారలనుకౌగిలించుకునిఉరములు-ఆననములు-పిరుదులు స్పృశించున్నంతసేపును వారేమియు మాటాడలేదు. సాద్భుతమగు నా సన్నివేశమున వారు మాడాడలేదు. తాము మాటాడక ఋశ్యశృంగుని యాత్సుక్యమును పెంచిరి. 'ననున్ మీవెంటఁ గొంపోదురో? మీ పుణ్యాశ్రమ హోమ కర్మలు గనన్ంమేలౌను నా గుండె' కని యాతడనీన తరువాత 'మా యాశ్రమమున నన్నియుఁ గనక సౌధములు గల' వనిరి. ఇది యాతడడిగిన ప్రశ్నకు సమాధానము గాదు. ఇంకను నతనికొక అస్తిత్వమున్నదా? లేక తమ చేతిలోని వాడైనాడా? అను విషయమును స్పష్టము చేసి కొనుటకు వారా వాక్యము పలికిరి. వానికి అస్తిత్వము లేదు. ఉన్నచో తన ప్రశ్నకు సమాధానమును ముందిమ్మని కోరి యుండెడివాడు. లేదు కనుకనే కనక మన నేమని వారి మాట నందుకొని యడిగినాడు. వారేది పలికిననదియే అతని చెవికింపుగా నున్నది. కనక మన నేమో వారు చూపి చెప్పిరి. అట్లయిన తప్పక వత్తునని

నాడు. ఈ రెండింటికిని సంబంధము లేదు. తెలియకుండనే వారియందొక గౌరవము, వ్యామోహ మేర్పడినది ఋశ్యశృంగునకు. వారి యాహ్వానముతో నిమిత్తము లేకుండనే వారి ననుసరించవలయునన్నంత ఉత్సాహ మాతనిలో వారు రేకెత్తించిరి. వారిచ్చిన భక్ష్యములు సేవించుచు మరల 'నన్నాహ్వానించుట కేదియైనఁ గలదా యభ్యంతర?' మని యడిగినాడు. వారికి నమ్మక మేర్పడినది. మూడు మూరు లతనిచేత నడిగింపించి 'తమరున్ జనుదెంతురో! యాతిథేయ మందిచ్చెద మింతకన్న వలెనే చరితార్థుల మమ్ముఁజేయఁగ' ననివారు. అతడు తృప్తిపడినాడు. తన యాశ్రమమునకు వారి నాహ్వానించినాడు. వారంతట 'మిమ్ములబట్టి నిల్పితిమి. మేమును బోవలె మాకు ప్రత్యనాయమ్ములు పుట్టు తక్షణమయార్చవలెన్ జని. మీరు నాతిథేయమ్ములు మాకు వచ్చె. భవ దాగను నార్థము యుండుమందు రామమ్ముల నిందె వెల్లి.' అని బ్రాహ్మణ సంప్రదాయము ననుసరించి మాటాడినారు. మంచిదక్లే యుండుడని చెప్పి తన తండ్రి యుటజము చేరు వేళ యైన దని చనినాడు ఋశ్యశృంగుడు.

తాము నిర్వహించ వలసినదంతయు జాగరూకమై నిర్వహించిరి. అతడు పోయిన తరువాత వారి కొక భయము పట్టుకొన్నది. ఈ యమాయిక వ్యక్తి జరిగినదంతయు తండ్రియైన విభాండకునకు చెప్పునేమో నని వారి భయము. చెప్పినచో క్రుద్ధుడై వృద్ధమౌని వచ్చినచో నిక తమ పాట్లు పెరుమాళ్ళకే ఎరుక. మరునాడు ఋశ్యశృంగుడు

వారిని చేరవచ్చువరకు వారికా భయమున్నది. అంతవరకు వారు ముండ్లపై కూరుచున్నటుల బాధపడినారు. ఎంత గడుసరులైనను వృద్ధమౌనివలన భయ మిప్పుడు వారికి కలిగినది. ఇది సహజము. ఇపుడు వారు భీతహరిణ నేత్రలు. తండ్రికి చెప్పినాడో లేదో తెలియదు గాని విభాండకుడు మాత్రము రాలేదు. మరునాడు ఋశ్యశృంగుడే వచ్చినాడు. వారి యత్నము సఫలమైనది. అందరును అంగదేశమునకు వచ్చినారు. వర్షము కురిసినది. దేశ ప్రజలకు హర్షము కలిగినది. అంగదేశము ప్రవేశించుటతోడనే లౌకిక వ్యవహార రహస్యములన్నియు నా ఋషి కుమారునకు తెలిసిపోయినది. అంత రోమపాదు డెదురు వచ్చి శీర్షక మాతని పదాబ్జముల చేర్చి, ఆత్మజ నిచ్చి వివాహము చేయుదునని శాంతను పిల్చి చూపగా, ఋశ్యశృంగర్షి లజ్జయొత్తిడిబడి మొగము వాల్చగా "మజ్జారే! పురికిన్ వనంబునకు నీ మాత్రంబు భేదంబటంచజ్జల్ ప్రోవులు వారముఖ్యలు సురంటంటించి గెంటించుచు పరిహాసములు" చేసిరట. అంత శాంతకును, ఋశ్యశృంగునకును వివాహము చేసినాడు రోమపాదుడు.

ఋశ్యశృంగోపాఖ్యానమున వేశ్యల నింత కట్టుదిట్టముగా పూర్వ రామాయణ కర్తలు దిద్దలేదు. ఈ విషయమునమాత్రము భాస్కరాదుల కంటె రఘునాథుడు కొంతనయము. అతడు కూడ ఋశ్యశృంగునకును, వేశ్యలకును, జరిగిన సంభాషణము గాక, వారి వారి చేష్టల నభివర్ణించినాడు. వేశ్యలను గూర్చి ఋశ్యశృంగుడును, ఋశ్యశృంగునిగూర్చి వేశ్యలును మనస్సులలో ఏమేమనుకొనిరో

కొంత విపులముగా రఘునాథుడు వర్ణించినాడు. వేశ్య లను గొనిన విషయము లన్నియు అతి సామాన్యములు. అందు కొన్ని పేలవములు. కొన్ని అనౌచితీ దోష దూషితములు. వారు దక్షిణాంధ్ర యుగమునకు సంబంధించిన వారే గాని, రామాయణ కాలమునకు, అంగదేశమునకు సంబంధించిన వారు గారు. వారిని చూచిన ఋశ్యశృంగునకు కలిగిన ఆంతర భావములను వ్యక్తీకరించుచు వ్రాసిన మూడు సీస పద్యములలో నొకటి అత్యుత్తమము. ఒకటి ఉత్తమము. ఒకటి అధమము.

అబ్బురంబుగ నెద గుబ్బకొమ్ములు మొల్చె
ఘనులు వీరౌర నాకన్న ననుచుఁ
బదములఁ జొడమెడుఁ బద్మము ల్వీరల
మహిమ యెంతటి వింత మహి నటంచు
ఘనములు వెనువెంటఁ గదియుచున్నవి జల
దాకర్షణము వీరి కబ్బెననుచుఁ
బలుకుల నమృతంబు దొలఁకెడు బళివీర,
లమృతాంధసులకన్న నధికులనుచుఁ
గాన మెన్నఁడు నీసామగాన గరిమఁ
గఠిన పాషాణముల నీరుగాఁ గరంచె
నంచు మది నెంచి పలుమఱు నరుదు పడుచుఁ
గొమ్మకొన యూగఁ దలయూచికొనుచుఁ—జేరె!"

(రఘునాథ రామాయణము. ఆ. 2. ప. 157.)

ఈ పద్యము తరువాత నున్న రెండు సీసపద్యము లును నతని చేష్టలను వర్ణించునవి. చేష్టలకంటె భావము

లను సృష్టించుటలో గొప్పతనమున్నది. పై పద్యములో రఘునాథుడదియే చేసినాడు. అతని రామాయణమున సర్వత్ర ఇట్టి భావకల్పన కనుపించదు. అనౌచిత్యము లెక్కువ. ఋశ్యశృంగునకు వేశ్యలను చూచినపుడీ పై భావము కలిగినట్లు పూర్వ రామాయణ కర్త లెవ్వరును వ్రాయలేదు. విశ్వనాథ సర్వమును నానందములో లీనము చేసినాడు. రఘునాథుని వేశ్యలకు సంభాషణ చాతుర్యమే లేదు. భాస్కరాదులంత చాతుర్యమును చూపకపోయినను వేశ్యలచేత అధిక ప్రసంగము చేయింపలేదు. రఘునాథుడు చేయించిన దంతయు నదియే. ఏమి దిద్దినను విశ్వనాథ దిద్ది తీర్చినాడు వేశ్యలను.

రోమపాదుని దీనస్వరూపమును, పురోహితుల యుచితజ్ఞతను, వేశ్యల నెరజాణతనమును, ఉచిత ప్రవర్తనమును, ఋశ్యశృంగుని అమాయిక ప్రవృత్తిని కమ్మచ్చున తీసినట్లు చిత్రించినాడు విశ్వనాథ. ఋశ్యశృంగుని పాత్రచిత్రణమును విశేషమైన వైదుష్యమును ప్రదర్శించి నన్నయతో తౌల్యము తెచ్చికొనినాడు. వేశ్యల విషయమున నొక యుదాత్తతను కల్పించి, పూర్వ రామాయణములను మించి ఋశ్యశృంగోపాఖ్యానమును తేజోవంతము చేసినాడు. పాత్రల మనస్తత్వ వ్యక్తీకరణమునను, అర్థగాంభీర్య ప్రతిపాదక రచనాకౌశల్యమునను విశ్వనాథ తిక్కనను తలపించుచున్నాడు. మహాకవుల గ్రంథములనువలె విశ్వనాథ రామాయణమును మననము చేసి చేసి ఒక మాట మాటాడవలయును.

# అంతుతెలియని అంతర్యంగల వ్యక్తి శ్రీ గురజాడ

ఈలోకంలో ఎవడుకూడా ఏదో అంతర్యం లేకుండా ఏపనీ చేయడు ఉన్మత్తుడు తప్ప. మన మున్మత్తులముకాము. అప్పారావుగారూ కాదు. కాదని నీకెలా తెలుసునంటే ఆయన చేసిన పనుల్లో అంతర్యం వున్నది. అది ఉదాత్తమైందికూడా.

అప్పారావుగారు చేసినపనియేమి? రచన. మిగిలిన పనులతో నాకు నిమిత్తలేదు. ఆయన చేసిన రచన నాల్గు విధాలుగావున్నది. 1. నాటక రచన, 2. గేయ రచన, 3. కథా రచన' 4. వ్యాస రచన. నేనెరిగిన ఈ అన్ని రచనల సంఖ్యం 34. 3 నాటకాలు. 10 గేయాలు, 5 కథలు, 16 వ్యాసాలు, ఇందులో రెండు నాటకాలు అసంపూర్ణాలు ఒక కథా రెండు వ్యాసాలుకూడా పూర్తిగా వ్రాయబడక వున్నాయి. ఈ రచనల్లో ఉన్న అయన అంతర్యం ఏమిటి అని పరిశీలించాలి. ఈ అంతర్యం ఒకటే కానక్కరలేదు. బహువిషయాలకు సంబంధించి వుండవచ్చును. అప్పారావుగారిలో అలా వుంది. ముందు నాటకాలు చూద్దాం. అసంపూర్ణాలు వదిలేసి సంపూర్ణంగా వున్న కన్యాశుల్కం చూడండి. కన్యాశుల్కం వ్రాయడంలో ఆయన ప్రవృత్తి వ్యావహారిక భాషః సాంఘికేతివృత్తముః సంఘ సంస్కర

ణము అన్యదేశ శబ్దములు ఈ నాలిగింటిమీదా కేంద్రీక రింపబడ్డట్లు నాకు తోస్తుంది. వ్యావహారిక భాష అనగానే గిడుగువారు స్మృతికి వస్తారు. ఒక్కొక్క మండలంలో- ఒక్కొక్కవర్గంలో – భాష ఒక్కొక్క రకంగావుంటుంది. అలాగని ఆ భాష మాట్లాడే ఇతర మండలాల వారికది అర్థం కాకుండా వుండదు. కొన్ని శబ్దాలు అర్థంకావు. కొన్ని శబ్దాలు ఉచ్చారణలో వైవిధ్యంవల్ల కొత్తవిగా కనిపిస్తవి ఇతరులకు. ఎప్పుడు కూడా రచన కుపయోగింప బడే భాష మాట్లాడేదానికి దగ్గరగావుండాలి. మాట్లాడే భాష ఎప్పుడూ ఒక రకంగా వుండదు. అంటే వ్రాత భాషకూడా దాన్నిబట్టి మారుతూవుంటుంది. ఇది భాషా తత్త్వం. కాని కొన్ని కారణాలచేత తెనుగు భాష అంటే రచనలోని భాష వ్యవహారాన్ని అనుసరించి కొంతకాల మారలేదు. అప్పుడు వ్రాతకూ-వాచికానికీ మధ్య తేడా ఎక్కువయింది. అలాంటి కాలంలోగిడుగురామమూర్తి పంతులుగారు పుట్టి రంగం మీదకు వచ్చారు. వ్యావహా రిక భాషావాదమని గిడుగువారు లేవదీసిన దాని ఆంతర్యం వివిధ మాండలికాలు ప్రమాణీకరింబడి రచన కెక్కి భాషా సౌష్ఠవం చెడకుండా అభివృద్ధి కావటం. ప్రమాణీకరింప బడటం అనేది రచన కెక్కిన తర్వాత జరిగేది. ఈ రహ స్యాన్ని కనిపెట్టే అప్పారావు గారు తమ విశాఖ మండ లంలో విజయనగరం ప్రాంతంలో వాడుకలోవున్న శబ్దా లను తాము సుష్ఠుగా వున్నవనుకొన్నవి గ్రహించి రచన చేసినారు. ఆయన ఆలా చేసి రాదాపు అరవై సంవత్స

రాలు కావస్తున్నా తెనుగుజాతి మాత్రం మూడంకె వేసి నిద్రపోతూ మాండలికాలు సేకరించి అందు సుష్ఠురూపం గల శబ్దాలను ప్రమాణీకరిస్తూ ఒక వ్యాకరణం వ్రాయించటం జోలికిపోలేదిప్పటికి. అప్పారావుగారికి రామమూర్తి పంతులుగారికి వర్ధంతులు జయంతులూ మాత్రం చేస్తూ వున్నారు అక్కడక్కడ వారి ఆంతర్యం భాష సుష్ఠుస్వరూపంతో స్థిమితపడటం. ఆలాంటి పని మనం చేసుకున్నప్పుడే వారి ఆత్మకు శాంతి మన ప్రగుడ్డికళ్ళకొక కాంతి.

అప్పారావుగారి దృష్టి పడ్డ రెండో విషయం. రచనకు ఇతివృత్తం సజీవ సమకాలిక సంఘంనుండి స్వీకరించడం. ఈ పనిమాత్రం మనవాళ్లు చాలామంది చేసినారు. చేస్తున్నారు. అప్పారావుగారు తాము చూచిన వ్యక్తులను చూచినట్లుగా కన్యాశుల్కంలో చిత్రించారని ఆయనెరిగిన పెద్దలు చెబుతున్నారు. అందుకే బహుశః అందులో శిల్పం లోపించి వుంటుంది. తరువాతవాళ్ళు ఆ పొరపాటు చెయ్యకుండా చాలామంది తాము చూస్తూవున్న సంఘంలో సార్వజనికములు-సార్వత్రికములూ ఐన సత్యాలను సూత్రప్రాయముగా గ్రహించి విశిష్టమైన కళాకౌశలంతో రచనను సాగిస్తున్నారు. ఈ విషయానికి మాత్రం అప్పారావుగారి ఆత్మ పరమానందభరితం అవుతుందని నా నమ్మకం.

మూడవది సంఘ సంస్కరణము. ఈ పేరెత్తగానే కందుకూరి వీరేశలింగం పంతులుగారు మనముందు

వుంటారు. ఈ సంఘ సంస్కరణలోని ఆంతర్యంఏమిటంటే సంఘంలోని ఏ ఒక వర్గంకూడా కనీసం ఏ ఒక్క వ్యక్తి కూడా దుఃఖానికి ఆస్పదం కాగాదు అని. కేవలం వితంతు వివాహాలు - పంక్తిభోజనాలు, వేశ్యావృత్తి నివారణం ఇత్యాదులేకాదు సంఘ సంస్కరణలంటే, మనిషి నిర్మోహుడు కావటం పరమోత్కృష్టమైన సంస్కరణము. మోహము సర్వానర్థాలకూ మూలము. ఈ నిర్మోహ లక్షణాన్నే అప్పారావుగారు కన్యాశుల్క నాటకంలోని లుబ్ధావధాని పాత్రలో చివరకు ప్రతిపాదించారు. అందుకే ఆ పాత్ర సముచితంగా క్రమోన్మీలనమైందని వెనుక నేను వ్రాశాను. ఎప్పుడైతే నిర్మోహుడైనాడో అప్పుడు మానవుడు దేంట్లోనుచిక్కుకోడు. అన్నింటికి సాక్షిగా మాత్రమే వుంటాడు. ఈ గుణమే లుబ్ధావధానిచేత అమ్మిని వెళ్ళి ఆ మఠం చూపుమంటాను అని అనిపించింది. ఇంతకూ చెప్పవచ్చే దేమిటంటే అప్పుడింకా మనం ఒకరిని చూస్తే ఒకరు కావేషాలు పెంచుకొని గింజులాడుకొంటున్నామేగాని అప్పారావుగారి ఆంతర్యాన్ని గ్రహించి దేశహితైక దృష్టితో అంతఃశ్శోధనం జేసుకొని, పరపీడన మానుకొని సర్వే జనాః సుఖినోభవంతు అని అనుకొని ఆచరించే స్థితికి రాలేదు. ఆస్థితికి ఏనాడు చేరగలుగుతామో ఆనాడు అప్పారావుగారి ఆత్మకురతి మనకు గతి.

అన్యదేశ్యపదాలను మనం గ్రహించి ఉపయోగించుకోవటం ఆయన ఆంతర్యాల్లో నాల్గవది. భాష

ఎప్పుడూ కూడా తనకు తానై క్రొత్తశబ్దాలను ఈనదు. అన్య భాషా సంపర్కంవల్ల కొన్ని క్రొత్త శబ్దాలు ఆ భాషలో ప్రవేశిస్తవి. వాటిని ఏవగింపుతో చూడకూడదు. మనకు వెనుక సంస్కృత భాషా సంపర్కం కలిగినట్లే ఈమధ్య కాలంలో ఆంగ్లభాషా సంబంధం కలిగింది. ఆ భాషలోని శబ్దాలు కొన్ని మన దైనందినోపయోగంలో నిలిచి పోయినై. వాటిని సుష్ఠురూపాలు నిర్ణయించుకొని మనం గ్రహించుకోవాలి. ఈ విషయాన్ని వదిలేసి ప్రతిదానికీ తెలుగునూ వుండాలని ఇప్పుడు పెద్దలు గొందరు కృత్రిమంగా సృష్టిస్తున్నారు. ఈ జబ్బు మన తెలుగువారికే కాదు హిందీవారికి అధికంగావుంది. అప్పారావుగారు తమ కన్యాశుల్క నాటకంలో కేవలం ఆంగ్ల శబ్దాలు దాదాపు ఆరువందలు వాడినారు. అన్నీ వుచితాలుకావు. అందలి ఔచిత్యాన్ని మనం గ్రహించి మనం పురోగమించాలి. ఆయన ఆంతర్యం మాత్రం వుదాత్తమైనది. మనకు కావలసింది అదే. దానిని పట్టుకొని మనం శరవేగంతో ముందుకు దూసుకుపోవాలి. అలాంటి ప్రయత్నం మనలో యింకా చురుకుగా కనిపించటంలేదు.

అప్పారావుగారి రెండవ విధమైన రచన గేయరచన, ఛందంమీద ఆయన ప్రయోగం చేసినారు. ఈ అంశాన్ని తరువాత మనవారు చాలామంది బనికట్టారు. అయితే ఒక చిక్కేమివచ్చిందంటే ఆయనకువలె ఒక ప్రమాణం తరువాత వచ్చిన కొందరు యువ రచయితల్లో లేదు. సుష్ఠురచనా శక్తిగల కొద్దిమందిలో ఒక ప్రమాణదృష్టి

వున్నది. ఈ విషయాన్ని ప్రవచించి పరామర్శించాను నేను ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో ఒకసారి. (ఆ వ్యాసమే 'నైమిశము' అన్న గ్రంథములోనికివచ్చింది.) ఈలాఛందం మీద ప్రయోగం చేయటంలో ఆయన అంతర్యం భావానుగుణంగా ఛందం వుండాలని. అంతేగాని ఏది చెప్పినా ఆ చంపకోత్పలాల్లోనూ - ఆ శార్దూల మత్తేభాల్లోనూ చెప్పమనికాదు. ఛందం కోటులాంటిది. భావం గుడ్డ వంటిది. ఛందం మంచం లాంటిది. భావం మనిషివంటిది. మనిషికి సరిపొయ్యే మంచంలాగా భావానికి సరిపొయ్యే చందం అవసరం. మంచాన్ని చేయించుకొన్నట్లే ఛందాన్ని కూర్చుకోవలె. అలా చేస్తేనే అందం. ఈఅందాన్ని కూడా మనవాళ్ళు గుర్తించారు. అప్పారావుగారిగేయాల్లో ఉచితమైన క్రొత్త ఛందం సృష్టింపబడ్డది దానికాయన పెట్టినపేరు ముత్యాలసరం. అది తెనుగుదేశానికి ఆయనగారిచ్చిన కానుక. దాన్ని మనవాళ్ళు విరివిగా వాడుకోటం లేదు. వాడుకోకపోయినా క్రొత్తపుంతలు త్రొక్కుతున్నారు. అందుకు సంతోషించాలి

అప్పారావుగారు వ్రాసిన కథలు ఐదుమాత్రమే ప్రచురింపబడినవి. అందులోకూడా ఆయన అంతర్యం సంస్కరణమే! "మీ పేరేమిటి" అన్న కథలో గురువుగారున్నారే ఆయనలాగా వుండాలి మనుషులంతా యదార్థం తెలిసిన తరువాత మనిషి తన పూర్వాభిప్రాయాన్ని మార్చుకోవాలి. అలాకాకుండా తానుపట్టిన కుందేటికి మూడేకాళ్ళని కూచోరాదు. ఈ సూచనకోసరమే అప్పా

రావుగారు ముందు గురుశిష్యులను "మీరు వట్టి బౌద్ధులు" అని నిందించేవారని [illegible] శిష్యుడివద్ద నున్న ఒక పుస్తకం చదివి, "ఒరే ఈ పుస్తకం చదివేదాకా బుద్ధుడిమహిమ నాకు తెలియలేదురా. తప్పకుండా యీ మహానుభావుడు శ్రీ మహావిష్ణు అవతారమేనా" అని అన్నారనిన్నీ కథాంతంలో "శివుడన్నా, విష్ణన్నా, పీరన్నా, బుద్ధుడన్నా ఆ పరమాత్మ మటుకుఒక డేగదా!" అనీ అన్నాడనిన్నీ వ్రాసినారు. అలాంటి సహనంగల గురువులూ-భక్తిగలశిష్యులూ నేడు లేకపోవడం శోచనీయము. అప్పారావుగారా కథలో చెప్పిన శైవ వైష్ణవ మత ద్వేషాలు మనలో లేకపోయినా వర్గ ద్వేషం ఇంకా సజీవంగా చిలవలు పలువలుగా దినదినాభివృద్ధి చెందటంమాత్రం భరింపరానిది. ఈదుర్దశనుండి మనం ఎంతశీఘ్రంగా వైదొలగగలిగితే అంత మంచిది. అప్పారావుగారి కోసరమైనా ఆ పని చెయ్యటం అవసరం. ఆయన కథల్లో పేర్కొనదగింది సంస్కర్త హృదయంఅన్నది. ఇప్పటికీ సంఘ సంస్కర్తలమంటూ ఏవేవో పేర్లతో సంఘాలంటూ పెట్టుకొని తిరిగేవాళ్ళు చాలామంది నాకు రంగనాధయ్యర్లలా అగుపిస్తున్నారు. నేడు అనుభవం లేని యువకులు చాలా వాటిని నిర్మూలించటానికి సంఘాలు స్థాపిస్తున్నారు. వారంతా తిరిగి ఈ కథ చదవాలని మనవి జేస్తున్నారు. ఆ రంగనాధయ్యరునుగురించి అప్పారావుగారాకథలో అన్నమాటలు చూడండి. పుస్తకాలలోని "రెడీమేడ్" అభిప్రాయాలను సిద్ధాంతాలుగా స్వీకరిస్తూ ఆ

ఆలోచనల వాతావరణంలో మసులుతున్నాడు. ఇంతకు భిన్నమైన అభిరుచులను అతని జీవితం చవిచూడలేదు. కొన్ని సిద్ధాంతాలు, నమ్మకాలు ప్రోఫెసరుకున్నమాట నిజమే. కాని అవి అనంతమైన జీవిత సంఘర్షణనుంచి జనించినవికావు. అందువలన బలీయమైనవికావు." ఈ వాక్యాలకు వ్యాఖ్యానం అనవసరం. ఈ మన జీవితంలోని ఆంతర్యం దాని బహుముఖాలు దర్శించినవారు మనలో ఎంత మంది వున్నారు. ఎవరో చెప్పినదాన్ని గుడ్డిగానమ్మటమో లేక కోతలుకోసినాడు లెమ్మని తృప్తిపడటమో తప్ప నేటి యువకులకు చాలా మందికి తామగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చే స్థితిలేదు. అలాంటి ఆరోగ్యం వారి మనస్సుకిలేదు. కనీసం కూర్చుకునే యత్నంకూడా లేదు. ఇది పరమమైన విషాదాంతానికి దారి.

కథారచనలోని శిల్ప విషయంలో ఇప్పటి మనం ఒకడుగు ముందుకువేసి వున్నాం. ఆయన ఒక ఆంతర్యంతో కథచెప్పడం మొదలు పెట్టారు. ఆ వెసులుబాటు మనవాళ్లు గ్రహించి ఆ రంగాన సర్వతోముఖ ప్రతిభతో కదం త్రొక్కుతూ నడుస్తున్నారు. ఆయనకథల్లోఅధికంగావున్నది ఆఖ్యాయికా పద్ధతి. "మెట్లిడా" కథలోని ఆంతర్యం నాకు బోధపడలేదు. ముసలిపురి మెట్లిడాభర్త మొదటికథకునితో (కథ ఉత్తమ పురుషలో నడుస్తుంది) "అయితే యీ ముండని తీసుకుపో, నీకు దానంచేశాను, తీసుకుపో. నాకు శని విరగడైపోతుంది" అనిఅనడమూ చివరకు

ముసలిపురి కథకునితో కలిసి కాఫీ త్రాగుతూ భార్యతో "పర్వాలేదు నువ్వుకూడా తాగు. మన స్నేహితుడు" అనటం కథకుడు "భార్యాభర్తల సరాగానికి సంతోషించాను" అని అనటం చూస్తే ఆంతర్యం పట్టి ఇయ్యటంలేదు. అయినా మళ్లీ చదువుతాను. ఈ కథలో నాటకీయ శిల్పం ప్రవేశించింది. టెక్నిక్ వల్ల ఆయన కథలు గొప్పవికావు. అందులోని విషయం ఆంతర్యం గొప్పవి. ఆయన ఏరచన ఐనా అలాగే వుంటుంది.

ఇక అప్పారావుగారి వ్యాసాలు పరమోత్కృష్టమైన ఆలోచనా — తదనుగుణమైన నిశితవిమర్శ — ఆయన వ్యాసాలు జీవలక్షణం. "బకించంద్రుని నవలారచన" అన్న వారి వ్యాసం అస్మదాదులను సాహిత్య విమర్శ నాధ్వంలో ప్రవేశపెట్టింది. 1954 సంవత్సరం మార్చి పదవ తారీకున ఆ వ్యాసం మొదటిమారుగా నేను చదివాను. బకించంద్రుని నవలారచన అని వ్యాసానికి పేరున్నా అందులో ఒక "ప్రపుల్లముఖి" అనే నవలనుగురించే చర్చించాడాయన, ఆంధ్రంలోకి అనువదించిన శ్రీ సుబ్బారావుగారి భాషలో వున్న దోషాలు రెండు చూపారు. అనవసరమైన సంస్కృత శబ్దాలను ప్రయోగించడం ఒకటి — అనుప్రాసమును ఒత్తుగా ప్రయోగించడం రెండవది. ఈ రెండిటివల్లా సాధింపబడిన పరమ ప్రయోజనం ఏమీలేదు నిజానికీ నవలలో. ఇక బకించంద్రుని కథను అల్లడంలోని లోపం ముఖ్యంగా చర్చించారాయన. దేశకాలభేదములను మన్నించక స్కాటు నవలలోని కొన్ని అంశములను బంకిములు

తమ నవలలో చేర్చిరి. రాబిన్‌హుడ్డు వంటివాడే ప్రపుల్ల ముఖిలోని భవానీ ఠాకూరు, స్కాటుచేసిన దోషమునే బంకిములుచేసినారని అప్పారావుగారి నిష్కర్ష. ఈజాతి నవలలు ఉత్కృష్టమైనవి కావని అప్పారావుగారి తీర్మానము. ఈ వ్యాసమున అప్పారావుగారు వ్రాసిన ఈ వాక్యములు గమనించదగ్గవి. ఇప్పుడు మన పత్రికలలో రెండు విమర్శన మార్గములు కనబడుచున్నవి. ఇష్టులైన కవులను పొగిడివారి గ్రంథములందు తప్పులెన్నకపోవడము. అనిష్టులగు కవుల గ్రంథములయందు వున్నవి లేనివి తప్పులే యెన్ని గుణములను మరుగుపరచడము ఇంతకన్న భాషకు కీడువుండబోదు. తప్పులని నాకు తోచినవికనపరిచినందుకు శ్రీ సుబ్బారావు గారు నన్ను క్షమింతురుగాక!'' ఇప్పటికిని మనవారి విమర్శనముపై రెండు మార్గములనే నడుస్తున్నది. అసలు తెనుగుదేశం పరిస్థితిచూస్తే గట్టిగా ఒకకవిని విమర్శిస్తే తట్టుకొని నిలబడేటట్లులేదు, ఈనాడు. ఒకని ఒక కావ్యం ఉదాత్తంగా లేదని వ్రాస్తే వానికీ వీనికీ విరోధమనిన్నీ— ఒకనిఒక కావ్యం సముచితంగావుందని వ్రాస్తే వీళ్ళంతా ఒక ముఠాలా వుందనిన్నీ తృప్తిపడిపోవటమేగాని, నిజంఏమిటి? మనము ఆలోచిద్దాం. మళ్ళీ ఆ పుస్తకాలు ఒకసారిచదువుదాం! అన్న ఆలోచనే రావడం మానుకుంది మన వాళ్ళకు. అప్పారావుగారు చెప్పినట్లు బ్రతికివున్న కవులకు శ్రాద్ధము పెట్టడము చచ్చినవారికి వర్ధంతులు చేయడం యీనాడు మనవారి కలవాటైన పద్ధతి. "ఈ పద్ధతిని తలకిందులు

చెయ్యడంవల్ల భాషకు కొంత మేలుకూడా" నని తాము అభిప్రాయపడుతున్నట్లు వ్రాసినారు అప్పారావుగారు. మనంమాత్రం ఆ పద్ధతిని కనీసం ప్రక్కకైనా వరగనీయకుండా జాగ్రత్తగా పట్టుకువస్తున్నాం. అలాంటప్పుడు తలకిందులెల్లా కానిస్తాం చూస్తూచూస్తూ - మన దేశములో దురదృష్టవశాత్తూ సాహిత్యంపై విమర్శనము కొనసాగడమే లేదు. సారస్వత విమర్శనా సహాయం పొందకుండానే, దాని అజమాయిషీ లేకుండానే, సాహిత్యం మన దేశంలో ఎదుగుతూ వున్నది" ఇవి అప్పారావుగారి వాక్యాలే, ఆధునిక ఆంధ్రవచనరచన అనే వ్యాసంలోనివి. సాహిత్యం నవనవోన్మేషం పొందటానికి విమర్శన మవసరమన్నది అప్పారావుగారి ఆంతర్యం. దాన్ని గమనించి మన కవులు రచయితలు - విమర్శనను కోరుకోవాలి. విమర్శకుడంటే పరమ శత్రువుగా భావింపరాదు. ఇద్దరు విమర్శకులకు భేదాభిప్రాయాలు వస్తేనేం రానియ్యండి. విభిన్నములైన ఆలోచనా పద్ధతులను స్వప్రమాణంగా పోటీ పడనియ్యండి. ఇంత విశాల దృక్పథం మన రచయితలూ_మనం అలవాటు చేసుకోవాలి. అప్పారావుగారి అదేశం అదే. దాదాపు అరవై సంవత్సరాలనాటి మనిషి ఇంత సృజనాత్మకంగా ఆలోచించి చెప్పటమే గొప్ప. అలాంటి వ్యక్తిని మనం మరచిపోరాదు. ఆయన చూపిన మార్గాన నీ ప్రతిభా దీపంతో నీవు గమనించు. అంతేగాని అడుగుతీసి అడుగు వెయ్యకుండా ఆయన్ను గురించి ఏవో పొలికేకలు పెడతా

నంటే ప్రయోజనంలేదు. నీ కేకలను ఆయన సహించడు. ఆయన తత్వమలాంటిది కాదు. మిగిలిన వ్యాసాలుకొన్ని భాషకు సంబంధించినవి. కొన్ని విద్యావిషయాలకు సంబంధించినవీన్నీ. అందులో ఆయన మేధాశక్తి గోచరిస్తుంది. అంటే శాస్త్రీయమైన ఆలోచనా విధానమన్నమాట. ఆధునిక ఆంధ్రవచన రచన అన్న వ్యాసంలో పాఠ్య గ్రంథాలు ఏలావుండాలి ఏలావుంటే సర్వతోముఖమైన దృక్పథం విద్యార్థికి ఏర్పడుతుంది. అనే విషయాలు వానితోపాటు మన ఆధునికవచన గ్రంథాలలోని లోపాలు చర్చించారు. ఇప్పటికి మన తెనుగు పాఠ్య గ్రంథాలు అధ్వాన్నంగానే వుంటున్నాయి.

ఇంతకూ తేలింది ఏమిటి? అప్పారావుగారు జీవితాన్ని బహుముఖాలుగా దర్శించిన అద్వితీయమైన ప్రతిభాశాలి. ఆయనకువలె మనం దర్శనం అలవాటుచేసుకోవాలి. దేశకాల పరిస్థితుల నవగతం చేసుకున్న అమోఘమైన ప్రగతిశీలి ఆయన. ఉచితానుచిత వివేకంతో మనం పురోగమించాలి. ముందు వెనుకల ననుసంధానం చేసుకపోయే నిశితమైన దృష్టి మనకుండాలి. అప్పుడే అప్పారావుగారాశించిన "క్రొత్తపాతల మేలుకలయిక" క్రొమ్మెరుంగులు చిమ్మగలుగుతుంది. ఆయన యుగకర్త అవునాకాదా? మహాకవి అగునా కాదా? అనేచర్చ అనవసరం. ఆయన్ను అర్థంచేసుకోటానికి మార్గం అదికాదు. ఆచర్చ చేసేవారికి అప్పారావుగారి మాటల్లోనే సమాధానం వుంది. "మనకు

తెలియదన్నమాట" నన్నయ ప్రథమాంధ్రకవి అవునా కాదా అన్న చర్చలు జరిగే రోజుల్లో ఆయనకుదైవవశాత్తు స్ఫురించినమాట "మనకు తెలియదన్నమాట" యుట. మనకూ అదే శరణ్యం. ఇంతకూ ఆయన ప్రతిభా ఆయన ప్రకతీ ఎంత జీర్ణించితే అంత మంచిది మనకు. అందు కాయన రచనలు ఆవేశానికి లోనుకాకుండా ఆంతర్యం గ్రహించే జిజ్ఞాసతో చదువుకోవాలి. అంతు చిక్కని ఆంతర్యంగల వ్యక్తి అప్పారావుగారు.

# విషాదసారంగధర

ఆంధ్రనాటక పితామహులును, కీర్తిశేషులును, ఐన శ్రీ ధర్మవరము రామకృష్ణమాచార్యులవారిచే నీ నాటకము వ్రాయఁబడినది. ఇందైదంకము లున్నవి. ఈ క్రిందిది కథ.

రాజనరేంద్రుఁడు మాళవరాజు. అతని భార్య రత్నాంగి. తత్పుత్రుఁడు సారంగధరుఁడు. తదుద్వాహమునకై కన్యల నన్వేషించుకొఱకు దేశదేశములకు బ్రాహ్మణుల నంపినాఁడు రాజనరేంద్రుఁడు. వారు దెచ్చిన కన్యల చిత్రపటములలో విదర్భరాజపుత్రి చంద్రకళ, భోజరాజకుమారి చిత్రాంగి యను సౌందర్యవతులను నిర్ణయము జరిగినది. అందు చిత్రాంగి దగ్ర తాంబూలము. సారంగధరుని జిత్రపటమున దర్శించిన నాఁటనుండియుఁ జిత్రాంగి వానిపై వలపుగొనియుండెను. కాని రాజనరేంద్రుఁ డామె సౌందర్యమునకు ముగ్ధుఁడై చిత్రాంగిని దాను వివాహమాడి, కుమారుఁడైన సారంగధరునకుఁ జంద్రకళను బరిణయము గావించెను. చిత్రాంగి మనసుమాత్రము సారంగధరుని నుండి మరలలేదు.

కాలము గడచుచున్నది. రాజు మృగయావినోదియై బయలు వెడలెను. సారంగధరునకుఁ బావురముల యాట యనిన ప్రాణము. అతఁ డొకనాఁడట్లు పావురముల నెగుర వేసి యాడుచుండగా నా పావురము పోయి చిత్రాంగి నగ

రున వ్రాలెను. ఆమె దానిని బంధించెను. సారంగధరుఁ డామె ప్రాసాదమున కరిగి పావుర మిమ్మనెను. ఆమె యదను జూచుకొని, సరససల్లాపములు మొదలిడెను. అతఁడు చకితుఁడైనాఁడు. నీతులు పెక్కు పేర్కొనినాఁడు. ఆమె కవి వినిపించ లేదు. మరియు రేకెత్తి సర్వమును ద్యజించి వానిని కౌఁగలించుకొనుటకు యత్నము చేసినది. నిగ్రహించుకొని సారంగధరుఁడు వెడలిపోయినాఁడు. అది యామె కాగ్రహ హేతువైనది. మృగయ ముగించుకొని రా జరుదెంచినాఁడు. దుఃఖాతిరేకమునఁ జిత్రాంగి, సారంగధరుఁడు కాముక కేళీ కుతూహలమునఁ దన మందిరమున కరుదెంచినాఁ డనియు, బలిమి యొనర్చినాఁ డనియుఁ జెప్పి రాజనరేంద్రుని "మామ" అని సంబోధించినది. రాజు నమ్మినాడు. సారంగధరుని బంధించి, న్యాయము విచారించి కాలు సేతులు ఖండించవలసినదిగా నాజ్ఞ యిచ్చినాఁడు. తలవరులు రాజాజ్ఞ ననుసరించిరి.

రాజనరేంద్రుఁడును, చిత్రాంగియు శయనించిరి. నిద్రలో జిత్రాంగి కలవరించినది. రాజునకు సత్య మెఱుక పడినది. ఆమెను నిద్రనుండి మేల్కొలిపి విషయము గద్దించి యడిగినాఁడు. ఆమె నోరెత్తలేదు. కుమారుని కొఱకు నడవికి పరుగెత్తినాఁడు రాజు. కడపటి చూపు చూచుకొనినాఁడు. సారంగధరుఁడు మరణించినాడు. పురోన్ముఖుఁడైనాఁడు రాజు. ఈడున గాని పరిణయము వలన యనర్థములను బేర్కొని "ఈడుగాని వివాహ మెందును దగదు"

అని దుఃఖాశ్రువులతో రాజు నిష్క్రమించినాఁడు—ఇది నాటకేతి వృత్తము.

ఈ కథ యితఃపూర్వమే పలువురచే వ్రాయఁబడి యున్నది. 15వ శతాబ్దమునకుఁ బూర్వ మందున్న గౌరవ ప్రథముఁడు. అతఁడువ్రాసిన 'నవనాథచరిత్ర' మునఁ బ్రథమాశ్వాసాంతమునను, ద్వితీయము మొదలునను నీకథకలదు. 17వ శతాబ్దపు బూర్వార్థమున నున్న చేమకూర వేంకట కవి ద్వితీయుఁడు. ఇతఁడు "సారంగధర చరిత్రము" ప్రబంధముగా వ్రాసినాఁడు. తరువాత బాణాల శంభుదాసుఁడను వాఁ డీ కథనే ద్విపదగా వ్రాసినాఁడు. కూచిమంచి తిమ్మ కవియు నీ కథను వ్రాసినట్లు శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి గారు పేర్కొని యున్నారు.

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు తమ 'నవనాథ చరిత్ర పీఠిక' లో సారంగధరుని చరిత్రమును బోలిక కథల కొన్నింటిని బేర్కొనిరి. అవి పరస్పరము సామ్యము గల వియే. మహారాష్ట్ర భాషలలోనున్న 'కృష్ణాగరుడి' ని చరిత్ర నామ భేదముతో మన సారంగధరుని కథను బోలి యున్నది. శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు (కీ. శే.) తమ సారంగధర చరిత్ర పీఠికలో నుదాహరించిన భువేశ్వరుఁ డను రాజునకుఁ గలిగిన సంతానము - చంద్రావతి, శోభావతి, అనువాని భార్యల చరిత్రము చాలవఱకు సారంగధరుని కథయే. కన్నడభాషలోనున్న కుమారరాముని కథ గూడ నించుమించుగ సారంగుని కథవలెనే యున్నది. ఈ కథ లన్నిటియందును నొకరాజు ఇరువురు భార్యలు. పెద్ద

భార్యకుఁ గుమారుడు. రాజు లేని సమయమున కారణాంతరములచే నాకుమారుఁడు రాజు చిన్నభార్య యంతఃపురమున కరుగుట, ఆమె వలచుట, ఇతఁడు నిరాకరించినిరసించుట, ఆమె భర్తతోఁ గల్పించి చెప్పుట, రాజుకుమారుని కాలు సేతులు ఖండింపించి చంపించుట, తప్పక యున్నది.

తెనుఁగున నీకథ భారతాంధ్రీకరణమునకుఁ గారణభూతుఁడైన రాజరాజనరేంద్రునకంటఁగట్టబడినది. గౌరన వ్రాసిన కథయందు స్థలము మాళవదేశము. రాజధాని మాంధాతపురము. చేమకూర వేంకట కవి సంశయాస్పదముగ వ్రాసినాఁడు. రాజనరేంద్రుఁ డని ముందు పేర్కొనినాఁడు. తరువాత

మహిని రాజనరేంద్రుఁడు మాళవపతి
రాజరాజనరేంద్రుఁడు రాజరాజు -
ననఁగఁ బేరెన్నికకు నెక్కి యతిశయిల్లు
నింద్ర విభవుండు రాజమహేంద్ర విభుఁడు.

అని వ్రాసినాఁడు. మాళవపతి యని పేర్కొనుచు రాజమహేంద్ర విభుఁ డని చెప్పుట వానినే రాజరాజనరేంద్రుఁడనియు రాజరా జనియుఁ బేరెన్నిక గన్నవానిగా నిరూపించుటను బట్టి వేంకటకవికే యీ విషయమున నిశ్చితమైన యభిప్రాయము లే దని చెప్పవచ్చును. కథను నాంధ్రదేశమునకు సంబంధించినదిఁగా జిత్రించుటకుఁ దగిన యత్నము కొంత వేంకటకవిలోనున్నది. వీనికిఁ గొంచము తరువాతవాఁడైన కాకునూరి అప్పకవి తన లక్షణగ్రంథమున

టీక వ్రాయుచు "గ్రంథ పరిభావ" మున్గడించు సమయమున "రాజరాజనరేంద్రు తనూజుఁ డార్యసఖుఁడు సారంగధరుఁడు" అని పేర్కొనినాఁడు. ఈ రాజరాజనరేంద్రుఁడు భారతాంధ్రీకరణమునకు నన్నయ్యను నభ్యర్థించినవాఁడు గాక మరొకఁడు గాఁడు. అప్పకవి మతము ననుసరించి వానికుమారుఁడే సారంగధరుఁ డనవలయును. ఇంతకు పూర్వమే బాలభాగవత కర్త దోనేరు కోనేరు నాథకవి కృతిపతి వంశావతారవర్ణనాసందర్భమున "విమలాదిత్యుఁడు భానుమతియందు రాజరాజనరేంద్రుని గనె ననియు, అతఁడు రాజమహేంద్రవర మను పేర నొక పట్టణముఁ గట్టించి యదియే రాజధానిగా వేంగీదేశమును బాలించె ననియు, వాని కుమారుఁడే సారంగధరుఁ డనియు అతఁడు "ఆసక్తి బినతల్లియైన చిత్రాంగి, చేసిన యాపదఁ జెచ్చెర గడచి, యనఘుఁడై చౌరంగి యను సిద్ధుఁడయ్యె" అని వ్రాసియున్నాఁడు. కూచిమంచి తిమ్మకవి యీ సారంగధరుని కథ గోదావరి యొడ్డున రాజమహేంద్రవరముననే జరిగినట్లు స్పష్టముగా వ్రాసి యున్నాడఁట. కనుక నీకథ కాంధ్రదేశముతో నవినాభావ సంబంధ మేర్పాటు చేయవలయు నన్న ప్రయత్న మందరిలోను గలదు.

ఈ కథ యొక్క పుట్టు పూర్వోత్తరము లాలోచింతెదము. ఈ కథ కల్పితమే గాని యథార్థముగాదు. యథార్థమే యైనచోఁ బైన నిరూపింపబడిన సందిగ్ధత యుండదు. కల్పనకును నొక కారణ ముండవలయును. ద్రావిడులలో మేనమామ కూతు నుద్వాహమగుట విధి. ఇది

యనాది సిద్ధము. వరుఁడు బాలుఁడై యున్నప్పుడు యుక్త వయస్సువచ్చిన యావధువును నా బాలుని తండ్రి వివాహ మాడి యామెతో సంసారము చేసి సంతానమును గనును. తన కుమారునకు యుక్తవయస్సు రాఁగనే యామెనుఁ నామె సంతానమును గుమారున కప్పగించును, నాటి నుండి యామె యితని భార్య. ఆ సంతానము వారి సంతానము. ఇందుకుఁ బ్రోద్బలకముగా బ్రౌను దొర తన నిఘంటువున 'కోడలు' అను శబ్దమునకు 'చిన్నభార్య' (కోడి = చిన్న; ఆలు = భార్య) యనియు, మామ యను శబ్దమునకు, భర్త యనునది యర్థ మనియు వ్రాసెను. తమిళ, కన్నడ, భాషలలో 'మగన్' అనఁగాఁ గొడు కని యర్థము. మనకు మగఁడనఁగాఁ భర్తయని యర్థము. కొంత కాలము కుమారుఁడుగా నుండి తరువాత యతఁడే భర్త యగు నాచార మున్న యీ మన ద్రావిడులలో 'మగ' శబ్దమును భర్త యను నర్థమునఁ గొందఱు కుమారుఁ డను నర్థమునను వాడుచున్నారు. ఈ సంప్రదాయ మహాత్తరాహు లైన యార్యులకు నచ్చినది కాదు. వారి నాగరికతా సిద్ధాంతములకు నిది నింద్యము, న్యూనము. "మాతుల కన్యో ద్వాహః నింద్యః" అని వారి ప్రచారము. ఇట్టి ద్రావిడుల యాచారము నిర్మూలించుట కార్యులు కొన్ని గాథల నల్లి యుందురు. అట్టి కథలలో నీ సారంగధరుని కథ యొకటై యుండును. ఈ కథయందు దాక్ష్య సంప్రదాయము చెప్పి ద్రావిడులను సంస్కరించు ప్రయత్న మున్నది.

బహు భార్యలను గలిగి యుండుట దోసంగు కాదు. తండ్రి భార్య లందఱును గుమారునకు దల్లి వంటివారే. వారి యందుఁ గామేచ్ఛ బొడమరాదు. అసలు పర స్త్రీ జన మందే యట్టి దృష్టి కలుగరాదు. ఆ దృష్టి తక్షణము శిక్షింపఁబడవలయును. ఈ కథ యం దదే జరిగినది. సారంగధరుని పినతల్లియే యతనిని గామించినది. అతఁడు నిగ్రహించు కొనినాడు. ఆమె తన భర్తతోఁ గల్పించి చెప్పినది. ఆతఁడు సహించలేక కుమారుని కాలుసేతులు ఖండింపించినాఁడు. ధార్మిక ప్రవృత్తిగల సారంగధరుఁడు శిక్షింపఁ బడినచో ధర్మమే శిక్షింపఁబడినట్లు. ఆర్యమతమున కది విరుద్ధము. కనుక సారంగధరునకుఁ దిరిగి కాలుసేతులు వచ్చినట్లు చిత్రించుట జరిగినది. ఈ కథా నిర్మాణము నందలి భావము ద్రావిడ సంస్కారణమున కుపస్కారకముగాఁ గల్పింపఁ బడినది. ఈ కథను నుత్తరదేశ సంబంధిగానే వారు చిత్రించి యుందురు. "మహాత్ముల కథలను, మహాపురుషుల జీవితములను దమ తమ యభిజనములకు ననువగుచో నన్వయములకు నతుకు పెట్టుకొని యానందించుట మానవ స్వభావ" (శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రి) మగుట మన యాంధ్ర కవులు దానిని రాజరాజ నరేంద్రుని కంట గట్టి యుందురని తలఁచుట సమంజసము.

నవనాథచరిత్రమునందలి కథ. — రాజు రాజమహేంద్ర విభుడు. అతఁ డనపత్యుఁడు. శివునిగూర్చి సేవించెను. స్వప్నమున శివుఁడు ప్రత్యక్షమై పట్టపుదేవి యైన రత్నాంగికి సుతుఁ డుద్భవించు ననెను. ఆమె గర్భభారా

లసయైనది కుమారుని గన్నది, అతని పేరు సారంగ
ధరుఁడు. యౌవనప్రాప్తి యైన దాతనికి. ఘూర్జర రాజ
పుత్రి యైన మంగళాంగితోఁ బరిణయ మైనది. ఒకనాఁడు
రాజమహేంద్రుఁడు వేటాడుట కడవికిఁ బోయెను. సారంగ
ధరుఁడు పావురముల యాట యాడుచుండెను. ఆతఁ డెగుర
వేసిన పావురము రాజమహేంద్రుని భోగసతి చిత్రాంగి
యంతఃపురమున వ్రాలినది. దానిని దెచ్చుకొనుట కాతఁ
డుద్యుక్తుఁ డాయెను. సుబుద్ధి వారించెను. ఇతఁ డాతని
మిత్రుఁడు. సారంగధరుఁడు వినక వెళ్ళెను. చిత్రాంగి
వానిని శృంగారక్రీడకు దించుటను యత్నించెను. అతఁడు
తిరస్కరించెను. ఆమె బెదరించినది. లాభములేదు. తరు
వాత రా జరుదెంచెను. చిత్రాంగి సారంగధరుని పై నేరా
రోపణ చేసి చూపినది. రా జాగ్రహించినాఁడు. సారంగ
ధరుని బంధించి నఱుకుట కాజ్ఞ యిచ్చినాఁడు. మంత్రి
మతిమంతుఁ డాలోచించవలసినదిగాఁ గోరినాఁడు రాజును.
కాని లాభము లేకపోయినది. సారంగధరుఁడు శిక్షింపఁ
బడినాడు. శిక్షనుబొంది విలపించు సారంగధరునకు నాకాశ
వాణి వాని పూర్వకథను జెప్పినది. అంత మత్స్యేంద్రుఁ
డను సిద్ధుఁ డా రాకుమారు నార్తనాదము విని వచ్చి తన
మహిమవలనఁ గాలుసేతులిచ్చి సిద్ధులలోఁ గలుపుకొనెను.
చేమకూర వేంకటకవియు నీ కథనే గ్రహించెను. చిత్రాం
గిని రాజుగారి 'భోగ కుటిల శిరోజా తిలకము' అనియే
వ్రాసెను. సారంగధరుని భార్యపేరు మంజువాణి యని మా
ర్చెను. కాని 'ఘూర్జ రాధిపు గారాబుఁ గొమార్తె' గానే

యుంచెను. బాణాల శంభుదాసుఁడు మాత్రము కొద్ది మార్పు చేసినాఁడు. సారంగధరునకు వివాహము చేయుటకుఁ గన్యల నన్వేషించుచుండఁగ, చిత్రాంగి చిత్రపటము రాజు చేతఁ బడినది. రా జామె యందు బద్ధానురాగుఁడై ఖడ్గమును బంపి వివాహకార్యము నెఱవేర్చి చిత్రాంగిని దన భార్యగాఁ జేసికొనినాఁడు. చిత్రాంగి తాను చూచిన చిత్రము నందలి వాఁ డీ రాజమహేంద్రుఁడు కాకునికి సందేహించి చెలికత్తెలవలన సత్యమెఱిఁగి సమయమునకై నిరీక్షించుచుండెను. అని వ్రాసి తరువాత వెంకటి కథల వలెనె కలిపెను. కూచిమంచి తిమ్మకవియుఁ జిత్రాంగి రాజు రెండవ భార్యగనే చిత్రించెనఁట.

ఇఁక ప్రకృతము. శ్రీ రామకృష్ణమాచార్యుల వారు నవనాథ చరిత్ర సారంగధర చరిత్రము లందలి కథనె గ్రహించిరి. కొన్ని మార్పులున్నవి. చిత్రాంగిని రాజుగారి చిన్నభార్య యనిరి. ఆమె భోజరాజ పుత్రిక యని పేర్కొనిరి. సారంగధరుని భార్యపేరు చంద్రకళ యనిరి. ఆమె విదర్భ రాజపుత్రికయఁట. రాజాజ్ఞచేతఁ గాలుసేతులు నఱకఁబడిన సారంగధరుఁడు పూర్వగ్రంథము లందువలె నింటుఁ దిరిగి బ్రతుకలేదు. కనుకనే ఇది విషాద సారంగధర మైనది. విషాద సారంగధర యనునది విషాదాంతమైన సారంగధరుని చరిత్ర యనుట. ఈ విషాదాంత మను శబ్దము "ట్రాజెడి" అను నాంగ్ల శబ్దార్థముగా నుపయుక్తము. "ట్రాజెడీ యనునది గ్రీకుల నుండి యాంగ్లే

యుల కెక్కినది. గ్రీకు వాఙ్మయమున ట్రాజెడీ చరిత్ర విచిత్ర గతులలో గమనించినది. ఆంగ్లమునను నది భిన్న గతులం బురోగమించినది. సేక్స్పియరు కాలమున దాని కొక స్థిరత్వ మేర్పడినది. వాఙ్మయము మానవ జీవిత ప్రతిబింబము. హైందవ మానవ జీవితమునకును పాశ్చాత్యుల జీవిత విధానమునకును జాల యంతర మున్నది. అదే వాఙ్మయమునను బ్రతిబింబించినది. హైందవ వాఙ్మయము ధర్మప్రతిష్ఠాపనమున కేర్పడినది. ధర్మమునకు విషాదాంతత్వము పట్టదు. కనుకనే యార్యవాఙ్మయమున నది లేదు. సాంఘికము లైన నీతి నియమములే ధర్మమునందలి యంశములు. ధర్మస్థాపన కావ్యమునిన యొక విధి. అది కావ్య ప్రయోజనములం దొకటి. ఎట్టి క్లిష్ట పరిస్థితులయందైనను ధర్మమునకే విజయ మని మానవ విశ్వాసము. అది భంగింపఁబడఁగూడదు. ఇది భారతీయుల నరమున కంటుకొనిన భావము. ధర్మ వ్యతిక్రమమును వారు సహించరు. అధర్మ విజయము వారికి నరక తుల్యము. కావ్యమునకు నాయకుఁడు కాఁదగినవాఁడుదాత్తత గలిగి యుండవలెను. అట్టి వాని గాథ ట్రాజెడీ కారాదు. ఇది సిద్ధాంతము. పాశ్చాత్య పద్ధతి వేఱు. అనఁగా జీవన పద్ధతిగాదు, దానిని దర్శించు పద్ధతి. మానవుఁడు పరిపూర్ణ జ్ఞానము కలవాఁడు గావలెను. ఎంత పరిపూర్ణుఁ డైనను నొక లోప ముండక తప్పదు. దాని వలన వాని పరిపూర్ణత యంతయు నశించును. చివరకు వాఁడును నశించును. కనుక జనులు జాగరూకులై దానిని గూడ సవరించు కొనవలెను. లేనిచో

బతనము తప్పదు. ఈ నగ్నసత్య నిరూపణమునకే వారు ట్రాజెడీలను సృష్టించినది. సత్యమే వాఙ్మయమునం దైనను నిరూపింపఁ బడవచ్చును. ఆంగ్ల వాఙ్మయ పరిచయ మేర్పడు వఱకు నిట్టి పద్ధతి మనకు లేదు. నేఁ డేర్పడినది. దీనికి హేతు భూతులు శ్రీ రామకృష్ణమాచార్యుల వారే వీరితో పాటు శ్రీ శ్రీనివాసరావుగారు కూడ.

ట్రాజెడీ యనఁబడు నీ నాటకమునకు సిద్ధి పాశ్చాత్య విమర్శకుల దృష్టిని, కలుగునో కలుగదో పరిశీలించవలయును. The tragic hero is a person neither eminently virtuous or Just, nor yet involued in crime by deliberate vice or Villany but by some reason of human frailty· (ARISTOTLE) ఇది యొక నిర్వచనము. అంగీకరించక తప్పదు. నాయకుఁడు దాత్తత కలిగియుండి మానవ సహజమైన యొక దౌర్బల్యముచేత దోషనిర్వహణమునకు మొగ్గవలెను. దీనిని నిర్వహించుటలో నిరు తెఱఁగు లున్నవి. నాటకము లోని పాత్రలలో నొక దానితో నాయకునకు విరోధము కల్పించుట మొదటిది. నాయకుని మనస్సునందు విరుద్ధ భావద్వయ సన్నిహిత సంఘర్షణ ప్రతిపాదనము ద్వితీయము. ఇది యుత్తమము. షేక్స్పియరు ట్రాజెడీలయం దిదియే యనుసృతము. నాయకుడీ నాటకమున సామాజికుల సానుభూతికిఁ బాత్రమై నాటకసిద్ధికిఁ గారకుఁడు కావలెను.

అందుకుఁ దగిన యుదాత్తత-చిత్త సంక్షోభము ప్రదర్శింప బడవలెను. ట్రాజెడీకి సంబంధించిన మూలసిద్ధాంతము. ప్రకృతము విమర్శనీయమైన 'విషాద సారంగధర' నాటకమున నాయకుఁ డెవరు ? - 'ఈ నాటకము నందలి ముఖ్యపాత్రలు' అను చోట 'రాజనరేంద్రుఁడు-కథానాయకుఁడు' అని వ్రాయఁబడియున్నది. నాటకమున కుంచిన నామమును బట్టి సారంగధరుఁడు నాయకుఁ డనవలెను. ఇతనిలో నాయకుని లక్షణములు లేవు. చైతన్యం లేని రాతి బొమ్మవలె నున్నాఁడతఁడు. అతనిలో నొక యుదాత్తత లేదు. చిత్త సంక్షోభము లేదు. ప్రధానాంశములే లోపించినవి. ఆ పావురము లాట_చిత్రాంగి విషయ మన్యులకు జెప్పకుండుట_ సంభవించిన దాని ననుభవించుటకు సిద్ధపడుట-సారంగధరుని నాయకునిగాఁ జేయుట లేదు. కేవలము మనో నిగ్రహము గలవాఁడుగా గనిపించుచున్నాఁడు. మనో నిగ్రహము మానవ సహజమైన యొక బలహీనత గాదు. ఆంగ్లము నందలి ట్రాజెడీలలో నిట్టి నాయకుఁడు కానరాఁడు. నాయకుని మరణమే ట్రాజెడీ కాఁ జాలదు గనుక నాటకమున సారంగధరుఁడు మరణించినను, ఈ నాటకమునకు ట్రాజెడీ తనము పట్టదు. కనుక నీ నాటకము ట్రాజెడీ కాదు సామాజికుల సానుభూతికి సారంగధరుఁడు పాత్రుఁడు కాఁడు. యథార్థమును వాకొన నేరక పోవుట సారంగధరుని పతనమునకు హేతువైనది. సామాజికులకు నాయకుని యందలి యా బలహీనత యుదాత్తముగాఁ

గనుపించుటలేదు. కనుక నాయకునియందు సామాజికులకుఁ గరుణ బొడముటలేదు. అసలా నటనిలో ట్రాజెడీకిఁ దగిన నాయకుని తనము లేదు. నాయకునిలోనే యాతనము లేనపుడు నాటకమునం దుండ కుండుటయును సహజము. ఈ నాటకము ట్రాజెడీ కాదు. ఒకవేళ సారంగధరుఁడే నాయకుఁ డనియు మరణించినాఁడు గనుక ట్రాజెడీ యనియు ననుకొనినచో నీ నాటకము పంచమాంకము 5వ అనుబంధమున "మురారి దానవ విరామ కేశవ" అను గేయముపాడి సారంగధరుఁడు మరణించుటతో సమాప్తము కావలయును. కాని నాటక మట్లుగాక కొంత ముందునకు సాఁగినది. అందు రాజనరేంద్రుని పశ్చాత్తప్త హృదయాంతర్గత భావ వ్యక్తీకరణము జరిగినది.

కథానాయకుఁడు రాజనరేంద్రఁడను పక్షమొకఁటున్నది. పూర్వరంగము నందలి విభావసుఁ డను బ్రాహ్మణుఁడు "మఱల నీవు విదర్భకు, నే భోజపురికిం బోయి చంద్రకళను సారంగధరునకుఁ జిత్రాంగిని దనకు (రాజనరేంద్రునకు) నిశ్చయించి రావలయునఁట" అని హిరణ్యుఁడను వానితోఁ జెప్పుట వలన రాజనరేంద్రునిలో మోహాశృంగార ప్రకోపన మను బలహీనత స్థాపించఁబడినది. ఇఁక నాటకమంతయు దీని నాధారముగఁ జేసికొని క్రమవికాసము నందవలయును. ఈతని ప్రవయస్కతలోని స్త్రీప్రలోభము చిత్రాంగిని బలితీసికొనినది. వ్యక్తినిష్ఠమైన ప్రవృత్తులలో దైహికమున కంటె మానసికము శక్తము.

చిత్రాంగి శారీరకప్రవృత్తి రాజనరేంద్రమనోనుకూలమైనను మానసికము మాత్రము సారంగధరునిలోఁ బర్యవసించు టనివార్యమైనది. ధర్మాధర్మ విచక్షణ మందు లేదు. సారంగధరుని ప్రవృత్తులు రెండును ధర్మబద్ధములు. గను కనే సారంగధరుని లోఁబఱచు కొనవలయునను చిత్రాంగి యత్నమువ్యర్థమైనది. అనఁగా ధర్మముమీఁద విజృంభించిన యధర్మము మొక్కపోయినది. వెంటనే ప్రతీకారదృష్టి కలిగినది ధర్మమునకు. అనఁగాఁ జిత్రాంగికిఁ దత్ప్రతీకార నిర్వహణ బాధ్యత తనను ప్రలమ్బ పఱచిన రాజరాజనరేంద్రుని పైననే పెట్టినది. ఈపుట్టుటలో రాజనరేంద్రునిలోఁగల మోహశృంగారప్రలోభ చేతస్కత కనుకూలముగ సారంగధరునిలోని రాక్షసమైన కాముక చిత్తవృత్తి తనయందు స్థాయి నందుకొనిన దని నిరూపించి, తత్క్షణము రాజనరేంద్రుని యున్మత్తుని గావించి కార్యోన్ముఖమునకుఁ బ్రేరణ మొనర్చి, చిత్రాంగి చిత్రాంగిగా నిలిచిపోయినది. స్త్రీవిషయ లౌల్యము గల రాజు వెంటనే దౌష్ట్యమునకుఁ బూనుకొనవలయును. అపుడే ట్రాజెడీ రక్తిమంతము. కాని రాజట్లు చేయక న్యాయస్థానమున విచారణచేయించి నేరము ఋజువైనదని సారంగధరుని శిక్షించినాడు. ఇందు రాజనరేంద్రుఁడు ట్రాజెడీ నాయకుఁడుగా గాక న్యాయమును బాలించు చక్రవర్తిగా దర్శన మిచ్చుచున్నాఁడు. కనుక నాటక మిచట ట్రాజెడీ తనము కోలుపోయినది. ఆ న్యాయ విచారణమైనను జాల యసందర్భ

ముగ నున్నది. చిత్రాంగి నిదురలోఁ గలవరించిన దానిని బట్టి సత్యమును గ్రహించిన రాజు చిత్త సంక్షోభమునకుఁ దగిన పుష్టి యీ న్యాయవిచారణ మున్నందున కలుగలేదు. అయినను నీడుగాని వివాహము దుఃఖహేతు వను నాయకుని వాక్యము లందొక నైరాశ్యము గోచరించు చున్నది. రాజనరేంద్రుఁడు తన పశ్చాత్తాపము నిష్ప్రయోజనమని జీవితమునురోసి మృత్యువు నాహ్వానించుకొనినచో వానిలో ట్రాజెడీకిఁ దగిన నాయకునితనము ప్రదర్శిత మయ్యెడిది. కాని అట్లుగాక "యీడుకాని వివాహ మెందుకు? దగద"ని "దుఃఖముతో నిష్క్రమించు"ట నాటక సిద్ధికి భంజకమైన దనియే చెప్పవలసి వచ్చుచున్నది. ఎట్లయిన నీ నాటకము నకు నాయకుఁడు సారంగధరుఁ డనుటకంటె రాజనరేంద్రుఁ డనుటయే యుచితమని తోఁచుచుచున్నది. అపుడే ఇది ట్రాజెడీ యని చెప్పుటకు వీలుగలుగును.

ఇంక నిర్వహణ శిల్పము. అన్ని యితివృత్తములును నాటకమునకు బనికిరావు. బనికివచ్చిన యితివృత్తమును నాటక మర్యాదల ననుసరించి నాటకసిద్ధికిఁ గారణభూతము లగునట్లు విభజించుకొని రసపర్యవసితము పరమావధిగా నాద్యంతమును నడిపించుటయే నిర్వహణ శిల్పము. దీనికి భారతీయాలంకారికులనిర్వహణ సంధితోఁ బ్రసక్తిలేదు. ఇట్లని నిర్వహణశిల్పమున జెప్పబడిన యంశములందుఁ జేరకపోవు. పాశ్చాత్యులు పేర్కొనిన త్రైక్యమునం దును, వస్త్వైక్యము ముఖ్యము. దేశ కాలైక్యములు తరువా

తవి. ఈ సారంగధర నాటకమున వస్త్వైక్యము పాటింపఁ బడిన దనవచ్చును. అనఁగాఁ గథకు సంబంధించని యితి వృత్త ప్రసక్తి యంతగా లేదనుట. ప్రథమాంకమున రాజ నరేంద్రుఁడు సారంగధరుని బిలిపించి రాజనీతియు, ప్రభు త్వభంగియు నలవఱప వలెనని నిన్ను బిలిపించితి. ఎట్లును నీవింకఁ గొన్ని దినములలో నీ భద్రపీఠము నారోహింప నున్నాఁడవు గదా" అనుట వలననే నిరంతరము పావురము లాటలాడుకొను సారంగధరుఁడు తండ్రి వేటకుఁ బోయిఁ యుండఁగా దిరిగి వచ్చినవెంటనే రాజ్యాభిషేకము చేయు ననియు నంత నీయాటలకు వీలుండ దనియు, రాజు రాక పూర్వమే నా యాట లాడుట కుపక్రమించినాడు. వింధ్యా టవినుండి వచ్చిన ఎఱుకసాని యాహ్వాన మంగీకరించి రాజు వేటకుఁ బోవుట వలననే సారంగధరున కా యవకా శము చిక్కినది. రాజూర లేఁడు గనుకనే తన నగరున వ్రాలిన పావురమును బంధించి, దాని కొఱకు వచ్చిన సారంగధరునితోఁ దన మనోభావముల వెల్లడించినది చిత్రాంగి. ద్వితీయాంకమునఁ ప్రథమరంగ మంతయుఁ జిత్రాంగి మనోభావములకును సారంగధరుని చిత్తస్థయిర్య మునకును సంఘర్షణ. ఇంత సంఘర్షణము జరిగినను సారంగ ధరుఁడు లోఁబడమి. చిత్రాంగిలోని పాశవిక ప్రకృతి విజృభించి రాక్షసముగా మారి, ప్రతీకార దృష్టిని ప్రేరేఁ చినది. కనుకనే ద్వితీయ రంగమున వేటనుండి వచ్చిన రాజనరేంద్రుని యెదుట దుఃఖాతిశయ మభినయించి రాజు

పక్ష నమ్మిక కలిగించి చిత్రాంగి రాజుచేత

"వాని దండింతు ఖండింతుఁ బఱతుఁ జెఱుతుఁ
గడగి చంపుదు నొంపుదుఁ గలఁతు నలఁతు
దెరల నడఁతును బొడుతు వధింతుఁ దుంతు"

అని యున్మత్తుని జేసి పలికించి కార్యరంగమునకుఁ దింపినది· రాజు దిక్కుఁదోఁచనివాఁడు. కాని మతిమంతుని ప్రేరణమున సారంగధరుని ప్రత్యుత్తరమును బట్టి, రాజు చిత్రాంగిని శంకించినవాఁడు వలె నామెతో "ఎట్లు జరిగినదియుఁ బ్రమాణ పూర్వకముఁ జెప్పవలయునని – సారంగధరుఁడు నిన్నే మఱల నడుగుచున్నా" డనఁగ నేయామె రాజేంద్రా! నన్నేల యడిగెదు? సారంగధరుఁడు నిరపరాధి. నే నపరాధిని నన్నుఁ శిక్షింపుము" అని జాణతనము నెఱపుటతో రాజు చిత్రాంగిని బూర్తిగ విశ్వసించి సారంగధరుని బంధించుట కాజ్ఞ యిచ్చినాఁడు. దీనితో తృతీయరంగముపూర్తి· సారంగధరుని నేరము విచారింపఁ బడినది. తృతీయాంకమున నీ న్యాయవిచారణ మట్టితరుణమున నుచితము గాదనియు నందువలననే రాజనరేంద్రుఁడు టూరికెసీ నాయకుఁడుగా గాక చక్రవర్తివలెనె దర్శనమిచ్చుచున్నాఁడనియు వెనుక చెప్పియుంటిని. ఈ న్యాయవిచారణ మంతయుఁ బాశ్చాత్య పద్ధతి ననుసరించినదై జిగిగాని బిగిగాని లేనిదైనది. ఈ నాకమున వస్త్వైక్య మనుభంజించిన దీ విదారణయే. నాటకకర్త న్యాయవాది గనుక నీ యంశమును

జాల పెంచినాఁడు. కాని రక్తి మంతము గాలేదు. న్యాయ వాదులైన "ఉద్దండ, సదయుల" వాదములు అశక్తములు. ఉపన్యాసములు మాత్ర మతి దీర్ఘములు. అందునగ ముహో ద్ఘాతములు. పావురమునకుఁ బోయినవాఁడు కవచాదులఁ దీయఁగారణ మేమి" అని ప్రశ్నించి నేరము స్థాపించిన యుద్దండునకుఁగాని ప్రతిపక్షికిఁగాని యా కవచాదులను న్యాయస్థానమునకుఁ దెప్పించవలయు నను భావమే కలుగ లేదు. ఆపావురము నాతఁడు తీసికొని పోయినాఁడా లేదా యను ప్రశ్నతే లేవు వారికి. చివరకు నేరము ఋజు వైన దనిరి. తృతీయాంకము సమాప్తము. నాటకమున నేర్పడ వలసిన కరుణ సంత్రాసముల కీ యంకము కేవలము భంజ కముగా సృష్టింపఁ బడినది. శిక్షార్హుఁడైన సారంగధరుని తలవరులు కొనిపోవు చుండగా రత్నాంగి ప్రవేశించి విలపిం చుటతోఁ జతుర్థాంకము ప్రారంభము. ఈ విలాపము వ స్త్వంతర్భాగమేగాని ర క్తిగట్టుటలేదు. దానికి గారణము రచనా "శిల్పము" నందలి వాచిక లోపము. తరువాత రత్నాంగి రాజనరేంద్రునితో సారంగధరుని క్షమించ వలసినదిగాఁ జెప్పుట రాజు చిత్త సంక్షోభమునఁ జిత్రాం గిని దూషించుట ట్రాజెడీకి పుష్టిఁ నిచ్చినవి. పంచమాంక మునఁ జిత్రాంగి కలవరింతల మూలమున విషయము విశద మైనప్పుడు రాజు కలగుండుపడుట-చిత్రాంగిని ననుమా నించి దూషించి-కుమారుని రక్షించుకొను నుద్దేశమున నడవికి పరుగుదీయుట చేతులు కాలినతరువాత యాకులు కొఱకు వెతకినట్లుయి, సామాజికుల సానుభూతికి రాజనరేం

ద్రుఁడు పాత్రుఁడైనాఁడు. కార్యము మేరఁమీఱిన మీఁదట పూర్వాపరములను దలఁచుకొనిన రాజునకుఁ జిత్త సంక్షోభము మధికమైనది. దానితో నతఁడు నిరాశా నిస్పృహలతో జీవితమును రోయవలసి యుండెను. మరణిం చుటయే మేలనుస్థితికి రావలసియుండెను. కాని యట్లుగాక 73 ద్విపదపంక్తులలో "ఈడుగాని వివాహమెందును గా" దని నీతిని పౌరులకు బోధించుట యుచితముగా లేదు. నాట కమున మొదటనున్న బిగి తరువాత తరువాత లేదు.

నాటక మాందత్యము రసపర్యవసితమగుటకు నిర్వ హణ శిల్పమునం దంతర్భాగమైన రచనాశిల్పముసహాయ కారి యగును. ఇది దేశకాలముల ననుసరించి మాఱుచుం డును. శ్రీ రామకృష్ణమాచార్యులవారి కాలమునను నేఁటి కిని చాల భేదమున్నది. వారిచే నీనాటకము 1887 వ సంవత్సరమునకు ముందు వ్రాయఁబడినది. ఆ సంవత్సరము ననే ప్రప్రథమమున బళ్ళారిలోఁ బదర్శింపబడినదట. నాటి సామాజికులకు - నాఁటినాటక కర్తలకుఁ బ్రాబంధికరచనా శిల్పముపాదేయము. నేటివారి కది కంటగింపు. కనుక యీ నాటక మందలి రచనాశిల్పమును నాఁటిదృష్టితో విమర్శిం చవలయును. నాఁటినాటకములలో పద్యములు తఱచు చుండెడివి. వానికిఁ దోడు పాటలుగూడ. నాఁటి వచనము నేఁడు గ్రాంథిక మనునది. కేవల వ్యావహారిక వచనరచనా సమ్మిశ్రితములైన నేఁటినాటకములు పరిచయముగలిగిన మనకా కాలపు నాటకములందలి గ్రాంథిక వచనము

కొంత వింతగాఁ గనిపించక మానదు. ఆ వింతఁదనము కేవలము భాషాగతముగాక నటకుల వాచికముమీఁదను నాధారపడియుండును. కనుక యీ నాటకమునందలి వచనమునుగూర్చి యంతగా వ్రాయవలసినది లేదు. కాని యొక విషయము ఈ నాటకమున వచనము శబ్దాలంకారములతో నంత్యప్రాసలతో నిండి సుదీర్ఘములై రససిద్ధి కంతగా సహాయకారులగుట లేదు. అసలునాటకములందు సంభాషణము మాటమీఁదమాట పెరిగినట్లుగా నుండవలయును. ప్రతిమాటయు శక్తివంతముగా నుండవలయును. ఈ సంభాషణ తీసివేసినను నాటకము నడుచునుకదా యని యనిపించరాదు. అందును ట్రాజెడీలయందు నిబిడబంధ సత్యాధికముగా నుండవలయును. అది యీ నాటకమున లేదు. సారంగధరునియందు వలపునింపుకొనిన చిత్రాంగి తద్వ్యక్తీకరణమున కుద్యమించుచు హృదయాంతర్గతాందోళనము నిట్లు వ్యక్తముచేయును. "చెల్లిదంపుఁ దగులంపుఁదమిచే నేభయమును బాసి యెట్లయిన నీమనోహరాకారు లోఁబఱచుకొన నుద్యమింతును. తమకింతును. యోచింతును అయ్యో! నే నెంత ప్రేరేపించినను మాతృసమాన వనితాగమనమునకీసుందరుఁడొడఁబడునా యనిచింతింతును.సంకింతును.పలవింతును.మహాద్రోహమే,ఘోరపాపమే, యనివిలపింతును. మఱియు నుంకింతును, తలంతును, వెతగాంతును. ఏమిసేయుదును" ఈ నాటకమున వచనమంతయు నీపద్ధతిలోనన్నే యున్నది. తృతీయాంకమున న్యాయవిచారణసందర్భమున న్యాయవాదుల వాదనలన్నియు కొన్నిపుటల

కున్నవి. ప్రతి పాత్రయు పుటల నింపునట్లు భాషించుట ఈ నాటకమున నధికము.

ఇంక పద్యముల విషయము. ట్రాజెడీలలో లయాన్వితమైన ఛందోగమనము భావరంజకత్వమున కత్యవసరము. ఈ విషయము పాశ్చాత్య విమర్శక సమ్మతమే. ఈ నాటకమున మొత్తము 62 పద్యములు. 73 ద్విపదపాదము లున్నవి. పద్యములలో 21 సీసములు. ఇవిగాక, రాగతాళ నిరూపణముతో 56 పాటలున్నవి. ఇందలిపద్యములందు సామాన్యదోష మొకటున్నది. వచనములోఁ జెప్పిన భావమునే పద్యములోఁ జెప్పుట. పావురమునకై వచ్చిన సారంగధరుని జిత్రాంగి ఫలహారము గైకొనుమనఁగా నతఁడు నిరాకరించినాడు. అంతఁ జిత్రాంగి "ఊరక కాకేమున్నది? వచ్చి యొక్కింత ఫలహారము గైకొని మనసు రంజింపఁజేయుమన్న వలదని నిరాదరణ మొనర్చువానితో నేటిమాట" యని వెంటనే

"ఎన్నఁడును రాక వచ్చి మ
హోన్నతి నాకోర్కె-దీర నుపహారముగై
కొన్నన్ బాగను మనవిని
మన్నింపని వానితోడ మాటలిఁకేలా"—

అనును! ఇట్లే సారంగధరుఁడు "అమ్మా పొరబడితివి. ఈ సమయమున నామాట లెందుకని యంటిఁగాక మాటిరియొక్కటిగాదు." అని వెంటనె

"అమ్మా యదిగా దీ సమ
యమ్మున నామాట లేటికంటిని గాదే,
సమ్మతి పడితివె యెఱుఁగవు
పొమ్మా నానుడుల నిందుఁ బొరవడితివిగా"

అని యనును. ఇవి ద్వితీయాంకమున. ఇట్లంతటను గలవు. పంచమాంకమున సారంగధరుని శిక్షానంతరము రత్నాంగి విలాపము వచనముననుు బద్యముననుు నొకవిధముగా జరుగును. ఇట్టివి రసబంజకములని వేఱుగాఁ జెప్పనక్కఱ యుండదు. కనుక రచనా శిల్పవిషయమున నీ నాటకకర్త కంతశక్తియున్నట్లు గానరాదు.

ఈ పద్య రచనా విషయమున యీ నాటకమున మరొక లోపమున్నది. అనుకరణప్రాయ మైన పద్యరచన యది. వేటనుండి తిరిగివచ్చిన రాజనరేంద్రుఁ చిత్రాంగి దుఃఖాభినయము విశ్వసించుచు

"నిండు చందురుఁ బోలు నీ ముద్దుమోము
వనిత యే కఠినుండు వాడఁగా జేసె"

అను సీసపద్యము కంకంటివాని యుత్తర రామాయణము చతుర్థాశ్వాసము నందలి (227)

"వెల లేని కళలతో వెలయు నీ నెమ్మోము
వనిత యే వికలుండు వాడుపఱిచె"

అను పద్యమున కనుకరణమేకదా? పావురమును వదలి యాకశమున బోవు పావురమును సారంగధరుఁడు వర్ణించు

"గగనేందిరానుకయి సేయురవలచేఁ
బోలుపాఱుపాపటబొట్టనంగ"

అనుపద్యము చేమకూరవారి సారంగధరచరిత్రము ప్రథమాశ్వాసము నందలి (127)

"నవహారసంఘట్టనగ్రస్తపతయాళు
గగనలక్ష్మి మౌక్తికంబనంగ"

అనుపద్యమున కనుకరణము, కారాగారాబద్ధుఁడైన సారంగధరుఁడు తన చేతలకుఁ బశ్చాత్తప్తుఁడగుచు

"పారావతములాట పనిబూని నాకునే
డెలమి నాడెడు బుద్ధి యేల గలిగె"

అనుపద్యము చేమకూరవారి ద్వితీయాశ్వాసములోని(145)

"పట్టు పాఱుమటంచుఁ బారావతంబును
వెకిలినై నేనేల విడువఁ బోతి"

అనుపద్యమునకు సాలంకారానుకరణము ఇట్టి పింకను వెక్కులు, గలవు. ఉదాహరణము లనినచో గ్రంథమంతయు నగును. చేమకూర వాని భావములే యీనాటకమున గద్యపద్యములం దధికముగా నున్నవి. నాటకకర్త గద్యపద్యములు రెండిటియందును శబ్దాలంకారములు, అంత్య ప్రాసములు విరివిగా నుపయోగించినాఁడు. అవి

నాటకసిద్ధికిఁ బుష్టి కలుగ చేయలేదు. ఇందలి పద్యములు కేవలము పద్యములుగా నుండిపోయినవి గాని కవిత్వ మిముడ్చుకొనినవి గావు. అనఁగా యీ నాటకమున మేధా శక్తిచేత సంయుతమును, సంభావితమును నై తంత్రీలయ సమన్వితభాషలో వ్యక్తీకరించఁబడిన మనోహరమును నుత్కృష్టమునునైన, భావోద్వృత్తి కానరాదు. అనుకరణము నిజమునకు దోషము గాకపోయినను రసనిష్పత్తికిఁ గారణ భూతములు కాకపోవుటచేత లోపముగాభాసించుచున్నది.

నిర్వహణ శిల్పమున మూఁడవ ముఖ్యవిషయము, పాత్రోన్మీలనశిల్పము. కావ్యజగత్తున నీ శిల్పప్రతిష్ఠ ద్వివిధము. పాత్రచిత్రణ మొకటి. పాత్రవర్ణనము రెండవది. దృశ్యకావ్యములందుఁ జిత్రణమే యుపాదేయము. ఈ నాటకమునఁ బ్రముఖపాత్రలు మువ్వురు. రాజనరేంద్రుఁడు - చిత్రాంగి - సారంగధరుఁడు. రాజనరేంద్రుఁడు కథా నాయకుఁడు. నిజమున కితనిపాత్ర ట్రాజెడీ నాయకునకుఁ దగినదే యైనను చిత్రణ మంత పరిపూర్ణముగ లేదు. అది రచనా శిల్పమువలనఁ గలిగిన లోపము. ప్రప్రథమున రాచ ఠీవి కొంత ప్రదర్శింపఁ బడినది. అటుతరువాత ట్రాజెడీ నాయకుఁడై చక్రవర్తిగాఁ గొంతకార్యము నిర్వహించుట రసస్ఫోరకముగా లేదు. రాజోచితమైన యుదాత్తత వీని కున్నదని సారంగధరుని వాక్యములనుబట్టి యూహించు కొనవలయును. అంతియగాని వాని చేతలలోఁ గానరాదు. వాని వాచకమునఁ బొడసూపదు. స్త్రీప్రలోభమే యాతని

జీవితము. కుమారుని యందలి వాత్సల్యమునకంటె నది యధికముగా ముందు కన్పట్టును. తుదకు వాత్సల్య మధిక మగును. కాని కార్యము మించిపోయినది. చిత్రాంగి చేతిలోఁ గీలుబొమ్మ రాజనరేంద్రుఁడు. ముందువెనుక లాలోచించు తత్త్వమున్నను కామాంధకారము కనుగప్పుట వలనఁ దుదవరకు నాతనికి కనువిప్పు కలుగలేదు. తరువాతఁగలిగియుఁ బ్రయోజనము లేకపోయినది. చిత్రాంగి పట్టినపట్టు నెగ్గించుకొను తత్త్వముగలది నెగ్గకపోయినచో రాక్షసకృత్యమునకైనను దిగి యామె ప్రతీకార మొనర్పక యుండలేదు. ఆమెలో నుద్రిక్తత యధికము. మోహమను నంతశ్శత్రువునకు మనస్సు సదుపదేశము చేయును. కాని యీమెయందలి యంతశ్శత్రువే బలవంతము. కనుక నాశత్రువునకులోఁబడి యెట్టిఘోరమునకైనను నీమెదిగును. ఆకార్యము నెఱవేఱనిచో మోహాంతశ్శత్రువు ప్రతీకారాంతీ శత్రువుగామాఱియామెనుమరలఁబురికొల్పును. తన్నిర్వాహణ మునకామె యశక్తులనుశక్తులనుజేసినిలుపును. సారంగధరుని పైఁగల యాగ్రహమున వానిని శిక్షించుటకు సహజముగ నశక్తుఁడైన రాజనరేంద్రుని శక్తునిగాఁజేసి రంగమున దింపినది. విషయమునందలియదార్థ్యము రాజనరేంద్రుఁ డెఱిఁగినవెంటనే పతితమైనది. అచట నామె వీఁగినది. ఈమెపాత్ర ఈ నాటకమునఁ బరిపుష్టముగనే పోషింపఁ బడినది. కాని రచనాశిల్పమందుకు దోహద మంతగా నీయలేదు. సారంగధరుఁడు ప్రతినాయకుఁడనవలయును. కాని వానిలో నా లక్షణములు లేవు. రాజకుమారుఁడు

గదా—తదనుగుణముగా నైనను పాత్రచిత్రణము జరుగ లేదు. పట్టాభిషేకము చేయనుంకించిన తండ్రితో "నీవు మని నంతకాల మేలుకొను చుందు" నని సమాధానము చెప్పుట రాజకులోచితము గాదు. స్త్రీవిషయ లౌల్యము లేకపోవుటయే వీని యుదాత్తతకు హేతువు. ఇతర గుణ విశేషములా యుదాత్తతను భజించుచున్నవి. చిత్రాంగి విషయ మన్యులకుఁజెప్పకుండ దాఁచి మరణమును గోరి తెచ్చుకొనినాఁడు. ఈ తని తల్లి రత్నాంగి పరిదేవనమును బట్టి యీతఁడొకయమాయకునివలె-పసివానివలెఁగనిపించు చున్నాఁడు గాని మరొకటిగాదు. ఇట్టివానికి స్త్రీ విషయ లౌల్యము లేకపోవుటే సహజమైన బలహీనతవలె నున్నది గాని యుదాత్తతగా లేదు. అమాయకతనుమించిన గుణవిశే షమీసారంగధరునిలో లేదు. సామాజికులహృదయగ్రంథిని గదలించఁ గల భావనావ్యాపార మతనిలో లేదు. కనుక సానుభూతికిఁ బాత్రుఁ డగుట లేదు. మిగిలిన పాత్రలు కొన్నియున్నవి. ప్రముఖపాత్రలే యిట్లుండ పెరల విష యము తడవనేల?

ఆ కాలమున నీ నాటకమునకుఁ బేరుప్రఖ్యాతు లుండెడివి. ఆంధ్రమున నాటకరచన నాఁడే ప్రారంభము. అతఃపూర్వము నాటకములు లేకపోలేదు. సంస్కృతాను వాదము లుండినవి. కాని తెనుఁగున స్వతంత్రరచన లంతగా లేవు. క్రొత్తగాఁ గల్పింపఁ బడిన యితివృత్త ముతో స్వతంత్రముగా రచింపఁబడిన తెనుఁగునాటకము వావిలాల వాసుదేవశాస్త్రిగారి "నందకరాజ్య" మనియు,

అది 1880 లో ప్రకటితమైన దనియు జయంతి రామయ్య పంతులుగారు వ్రాసిరి. దానినిబట్టి, యప్పుడప్పుడే తెనుఁగున స్వతంత్రనాటక రచన ప్రారంభమైనదని యూహించవచ్చును. ఆచార్యులవారి యీ నాటకము 1887 లో గనుక ప్రాథమికావస్థలోనే యున్నదనుట నిర్వివాదము దీనికిఁదోడు రామకృష్ణమాచార్యులవారుపురాణములనుండి కథనుగ్రహించిపాశ్చాత్యపద్ధతినివ్రాయుటకానాఁడే యుపక్రమించిరి. కనుకనే దీనిస్థితి యిట్లున్నది. ఆంధ్రనాటక రచనావికాసమును సూచించుటకీ సారంగధర నాటకముపకరించును. కనుకనే యీ నాటకమున నిర్వహణ శిల్పము మొక్కవోయినట్లు నిరూపించుట సత్యదూరము కాఁకాలదు. అన్నింటనుబక్వదశ యొకనాఁడేరాదు. కొంత కాలము పట్టును. నాటివారుగనుక యీ మాత్రమైనను గృషిచేసిరి. నేఁడసలు మెఱుక పట్టినది. క్రొత్తతెన్నులు వచ్చినవి, వచ్చుచున్నవి. ఇందేవి నిలుచునో, యేవి కాలగర్భమునఁగలియునో మన మూహించలేము. నాఁటి పరిస్థితులలో నాటక మంతకంటే వ్రాయఁబడదు. నాఁటిపండితులను మెప్పించుటకుఁ బ్రాబంధికశైలి గ్రహించక తప్పినదిగాదు. పామరుల నుద్దేశించి పాటలు వ్రాయుట యనివార్యమైనది. తాను పాశ్చాత్య పద్ధతి ననుసరించవలయు ననుకొనుచుండుట చేత గ్రహించిన యితివృత్తమును ట్రాజెడీగా నిరూపించుటకు యత్నముచేసినాఁడు. అన్ని విషయములందును గొంతకుఁగొంత కృతకృత్యుఁడైనాఁడు. ఆ కృషిని సహృదయముతోఁ బరామర్శించి తగవరితనము

నెఱపవలసిన గురుతర బాధ్యత మనమీఁద నున్నది. కొంత వఱకు నేను బరామర్శించితిని. నాపరిశీలనా ఫలితమే యీ వ్యాసము. ప్రబోధ చంద్రోదయమునందలి

"పొరిఁబొరి నొప్పసలాకల
నొరసిన కుందనపుఁ బూఁదియును బోలె సభన్
సరసుల సంఘర్షణమున
వరకవి కావ్యంబు మిగుల వన్నెకు నెక్కున్"

అను పద్యము నాకు ప్రబోధమై నన్నీ విమర్శనా వ్యాసంగ మున కుపక్రమింపఁ జేసినది. నా మేధ కందినంత వఱకుఁ దోఁచిన విషయము మీముందుంచితిని. గుణాగుణములు పరిశీలింపఁ బడును గాక!

# కవిగా ప్రతాపరెడ్డిగారు

కవిగా ప్రతాపరెడ్డిగారిని నేను ప్రారంభించుట యేలననగా ఇంతకుపూర్వము పెద్దలు చాలమంది మహా పురుషుడుగా, పరిశోధనా దక్షుడుగా, ఉత్తమ దేశికుడుగా చారిత్రకుడుగా రెడ్డిగారిని గూర్చి ప్రస్తావించియుండుట వలన. అనగా రెడ్డిగారి కవితాశక్తిని గూర్చిన ప్రస్తావన ఇంతకుపూర్వ మెవరును చేసి యుండకపోవుటవలన. అసలు ప్రతాపరెడ్డిగారి పేరు ఆంధ్రుల సాంఘికచరిత్ర ముతో పెనవేసుకొన్నది. ఆయన వ్రాసిన ఇతర గ్రంథ ములెన్నియున్నను ఆయన పేరెత్తగనే కనులముందు సాక్షా త్కరించునది ఆంధ్రుల సాంఘికచరిత్రమే. తరువాత రామాయణ విశేషములు. గోలుకొండ కవుల సంచిక, హిందువుల పండుగలు, గ్రంథాలయోద్యమము ఇత్యా దులు. ఆయన బహుముఖ ప్రజ్ఞావంతుడు. అందు కవితా ముఖ మొకటి. తత్సబంధ ప్రజ్ఞావిశేషమును దిఙ్మాత్ర ముగా నీ వ్యాసమున సూచింతును. అప్పుడప్పుడు వ్రాయ బడి పత్రికలలో ప్రకటింపబడి పడక ఉన్న రెడ్డిగారి పద్య ములు రెండువందలకు పైగా ఉస్మానియా విశ్వవిద్యాలయ మున ఆంధ్రసాహిత్యోపన్యాసకులు, మదాప్తమిత్రులు నైన డాక్టరు బి. రామరాజుగారివద్ద నున్నవి. రెడ్డిగారి అ ముద్రిత రచనలు కొన్ని యింకను వారివద్దనున్నవి. రెడ్డి

గారి పద్యము లన్నింటిని తమవద్ద నున్నంతవరకు శ్రీ రామరాజుగారు నాకిచ్చి చూడమనినారు. అందు క్రీ. శ. 1919 సంవత్సరంనుండి 1952 వరకు రెడ్డిగారు వివిధ విషయములను తీసికొని, వివిధ సందర్భములను పురస్కరించుకొని వ్రాసిన ఖండికలు దాదాపు నలుబది యున్నవి. అందు కొన్ని చాలవరకు ఏవేవో పత్రికలలో ప్రచురింపబడినవే, శ్రీ రామరాజుగారిచ్చిన వ్రాతప్రతులలో ప్రచురింపబడినచో పత్రిక పేరు, కాలము పేర్కొనబడి యున్నవి. ప్రచురింపబడని వైనచో రచనా కాలము పేర్కొనబడినది. రెడ్డిగారు స్వయముగా తా మేసందర్భమున నేది వ్రాసినది చెప్పుకొనినారు. ఈ విషయ మాయా ఖండికలకు ముందు వ్రాయబడినది. ఈ పద్యముల నన్నింటిని కలిపి ముద్రించినచో నొక మంచి ఖండకావ్య సంపుటి యగును. పుస్తకరూపమున రెడ్డిగారి పద్య రచనలు లేవు గనుకను, పత్రికలలో ప్రకటింపబడినను అవి వెనుకబడి పోయి నేటివారి కుపలభ్యము కాకున్నందునను నే నీ వ్యాసమున మునుముందు శీర్షికలతో విషయ వివరణము చేసి అటుతరువాత రెడ్డిగారి కవితాశక్తిని పరిశీలింతును.

1. మిత్రస్మృతి:- పద్యముల సంఖ్య 7. రచనా కాలము 1919. కర్నూలు వాస్తవ్యులు వేలాల సుబ్బయ్యగారు బి. యె., ప్లీడరు మరణించినప్పుడు వ్రాసినవి. ఆయన రెడ్డిగారి కాప్తులట. అధో జ్ఞాపికలో 'వివిధ దంపతీ విలాసము-అను గ్రంథాదిలో ముద్రింపబడినవి' అని యున్నది.

ఆ గ్రంథము రెడ్డిగారిదో మరొకరిదో లేక సంకలనమో తెలియదు.

2. మిత్రుడా : ఇది గేయము. ఇదే కొద్దిమార్పుతో 'మహోదయము' అను ఆధునిక గీతికా ఖండికా సముచ్చయములో "తెనుగునాడు" అను శీర్షికతో ప్రచురింపబడినది. కొద్ది మార్పనగా.

దత్తమండల ధైర్య పటిమయు
నుత్తరాంధ్రుల యుచిత చర్యలు
నుత్తమంబుగ నొప్పి యుండెడు
తెనుగునాడిది మిత్రమా !

అను నాల్గు పాదములు లేక యున్నదా తెనుగు నాడన్న ఖండిక. వ్రాతప్రతిలోని పై నాల్గు పాదములను పెన్సలుతో కొట్టివేయబడి యున్నవి. దీని రచనా కాలము 1920.

3. పద్మిని : ఇది రెండువందల పంక్తుల గీతమాలిక. రచనాకాలము 1921. ప్రతాపసింహుడు దావుదుఖాను నోడించి అజితసింహుని సింహాసనస్థునిచేసి వాని కుమార్తె పద్మినిని వివాహమాడుట ఇందలి ఇతివృత్తము.

4. ఈశ్వరయ్య : నాలుగు పద్యములు. రచన 1923 అలంపురమున పాణెము ఈశ్వరయ్య యను బ్రాహ్మణుడు ఆంధ్ర మహాభారతము నుత్తమముగా వ్యాఖ్యానము చేయుచు పురాణము చెప్పినాడట. ఆ పురాణ శ్రవణానంతరము ఆ బ్రాహ్మణుని ప్రశంసించుచు వ్రాసి అయనకు సమర్పింపబడిన పద్యము లివ్వి.

5. మహమ్మాదు ఘజ్నవీ : ఇది 135 పంక్తుల గీత మాలిక. రచన 1920. మహమ్మదుగజని భారతదేశము నందలి సోమనాథ దేవాలయమును దోచుకొనివెళ్ళి - తన యౌన్నత్యమును గూర్చి 'ఫిర్దౌసి' కవిని కావ్యము వ్రాయు మని-ఆయన వ్రాసి తీసికొని రాగా-సముచితముగా సన్మా నింపక-ఫిర్దౌసి విరక్తుడై పోయినపిదప కొంతకాలమునకు తాను మొదట నిత్తునన్న ధనమును ఆకవికి పంపుట - ఆ సమయముననే ఆయన మరణించుట - ఆ ధన మాయన కూతురు గ్రహింపకుండుట - ఈ కథా ఖండికలోని ఇతి వృత్తము. జాషువాగారి 'పిరదౌసి' అను కావ్యమునందలి వస్తువును ఇదియే. ఫిరదౌసి రచనకాలము 1932 సంవత్స రము ప్రాంతముగా నవ్యాంధ్రసాహిత్యవీధులలో నున్నది. రెడ్డిగారి ఈ ఘజ్నవీ రెడ్డిరాణి పత్రికలో 1920 సంవత్సర ములో ప్రకటింపబడినది.

6. స్వాగతము : పద్యములు 5. రచన 1921. కర్నూలులో జరిగిన సప్తమ రెడ్డి మహాసభలో చదివిన పద్యములు. రెడ్డి వంశ ప్రశంసా గర్భములు.

7. మద్యపానము : పద్యములు 5. రచన 1922. మద్యపానము వలన కష్టనష్టము లిందు చెప్పబడినవి. అధో జ్ఞాపికలో "మద్యపానము అను స్వీయ గ్రంథము నుండి" అని యున్నది, అందువలన మద్యపానమున్నదొక గ్రంథ మున్నదని తెలియుచున్నది. గోలకొండ కవుల సంచికలోని కవి పరిచయమున మూడు వివిధ గ్రంథము లీ పేరున ప్రక టితములని యుండుటచేత మద్యపానమన్నదొక గ్రంథము

మాత్రమే కాదని స్పష్టము. ఈ ఐదు పద్యములు ఆ మూడు గ్రంథములలో దేనిలోనివో తెలియదు. ఇందలి.

"ధనమా వ్యయమైపోవును
మనమా చంచలకుందనమును మానును; యశమా
దినదినమును క్షీణించును
తనువా చెడిపోవు కల్లు త్రావుట చేతన్"

అను పద్యము శ్రీ తిరుపతి వేంకట కవుల శ్రవణానందము లోని 'ధనమాపోవును మానమా చెడును' అను పద్యము స్మృతికి తెచ్చుచున్నది.

8. ప్రబోధము : పద్యములు 8. రచన 1922. దత్త మండలి గ్రాద్యుయేట్ల వార్షికోత్సవ కాలమున వ్రాసి చదువబడినవి.

9. రతన్‌దేవి : పద్యములు 6. రచన 1923. జలియన్‌వాలాబాగ్ దురంతమున అసువుల విడచిన వొక వీరుని ధర్మపత్ని రతన్‌దేవి. ఆమె యప్పటి స్థితిని గూర్చి వ్రాయబడిన పద్యము లివి. మాతృసేవలో ప్రకటితములు.

10. ధమ్మపద : పద్యములు 5. రచన 1926. బుద్ధ మహాత్ముని పాలీ భాషలోని ధమ్మపద బోధలనుండి అనువదింపబడిన పద్యము లివి. గోలకొండ పత్రికలో ప్రకటితములు.

11. అస్పృశ్యత : ఒక సీసపద్యము. 1927 మార్చి సుజాతలో ప్రకటితము.

12. నీతిపంచకము : ఈ శీర్షికతో రెండు కాగితములు, రెండైదులు పద్యములు వున్నవి. 1927, 28 సం॥

లలో సుజాతలో ప్రకటితములు. వేమన పద్యముల వంటివి.

13. ప్రణయినీ ప్రార్థనము : పద్యములు నాలుగు. 1929 సుజాతలో ప్రకటితములు. దక్షిణాంధ్ర యుగ సంబంధి భావుకత నిముడ్చుకొనిన రచన మిది.

14. ఎంత శూరత్వమో : ఒక సీసపద్యము. 1929 సుజాతలో ప్రకటితము. ఇది యొక హెచ్చరిక.

15. మహబూబునగర భాష : ఒక సీసపద్యము. 1929 గోలకొండ పత్రికలో ప్రకటితము. ఆ జిల్లాలోని వాడుక భాషను గ్రహించి కేవలము భాషను చూపుట కొరకు వ్రాయబడిన పద్యము. విపులమైన వివరణమున్న గాని అది అర్థముగాదు.

16. వేదము వేంకటరాయశాస్త్రి : ఒక సీసపద్యము 1929 సుజాతలో ప్రకటితము. ఇది గురుస్తుతి. ఈ పద్యము రచనపద్ధతి కేతన దశకుమార చరిత్రమున తిక్కనను గురించి వ్రాయబడిన "సుకవీంద్ర బృంద రక్షకు డెవ్వడనిన వీడను నాలుకకు తోడవైనవాడు" అనుదాని ననుసరించి యున్నది. దీని ప్రారంభము "సర్వపండిత బృంద సాహాయ్యకుం డెవ్వడనిన వీడనీ చూప నలరినాడు" అని.

17. పరుసవేది : పద్యములు నాలుగు. పంక్తులు పన్నెండు. 1929 సుజాతలో ప్రకటితములు. వేశ్య యొక రుక వివేకానందుడు తనకు దర్శన మీయ నిరాకరింపగా చేసికొన్న మనవి ఇది.

18 వెట్టివాని పాట : దండకము. 1931 సం॥న గోలకొండ పత్రికలో ప్రకటితము. ఒక వెట్టిచాకిరి మనిషి

తన నౌకరిలోని కష్ట నష్టములను పేర్కొనుటయే యిందలి విషయము. ఇది ఈ సంచికలోనే ప్రకటింపబడినది.

19. లుబ్ధాగ్రేసర చక్రవర్తి: పద్యములు నాలుగు. 1931 సం॥న గోలకొండ పత్రికలో ప్రకటితములు. ఒక లుబ్ధుడు తాను పైస నెట్లు చూచుకొనునది, దానిని సంపాదించుటకు తాను పడిన శ్రమ ఇత్యాదులను ప్రవచించును.

20 పౌరాణికేంద్రజాలము: పద్యములు రెండు. 1931 సం॥న గోలకొండ పత్రికలో ముద్రితములు, పురాణ కథలలోని అద్భుత విషయములు ఇంద్రజాలమును మించి యున్న వన్న అభిప్రాయమును ఇముడ్చుకొని యున్న పద్యము లివి. ఇందు కొంత త్రిపురనేని రామస్వామి చౌదరిగారి భావన ధోరణి యున్నట్లగపడును.

21. ధర్మాసనము: 210 పంక్తుల గీతమాలిక ఇది. 1931 సం॥న గోలకొండ పత్రికలో ముద్రితము. యముని వద్దకు సోమయాజి, కోమటి, వేశ్య, అర్చకుడు, కరణము, రెడ్డి, వైద్యుడు, ఆదిహిందువు వెళ్ళుట తమతమ జీవిత కథలను చెప్పుకొనుట, యముని తీర్పు — ఇందలి విషయము.

22. ప్రేమార్పణము: ఇది 60 పంక్తుల గీతమాలిక. 1931 సం॥న గోలకొండ పత్రికలో ప్రకటితము. యవన మహీశ్వరుని దుహిత యొకర్తుక గొల్లవాని నొకని ప్రేమించుట, తండ్రి వానిని చంపించుట, ఆమె తన ప్రియుని అంతిమ సందేశము ననుసరించి అంతఃపురమును వదలి వాని గొర్రెలను కాయుచు అడవిలో మరణించుట, వారిరు

వురను గొల్లవారు దేవతలుగా పూజించుకొనుట అందలి వస్తువు.

23. గార్దభేశ్వర స్తోత్రము: పద్యములు రెండు. 1931 సం॥ గోలకొండ పత్రికలో ముద్రితములు. గార్దభము యొక్క పురాతన మాహాత్మ్యమును గూర్చిన ప్రశంస. వేదమునందును మనుస్మృతి యందును గల గార్దభ ప్రశస్తి ఈ పద్యములలో స్పృశింప బడినది.

24. హంపీర సంభవము: పద్యములు 26. 1934 సం॥న గోలకొండ కవుల సంచికలో ప్రకటితములు. చిత్తూరు రాజగు "అర్సి" యను నత డొక కాపుకన్యను ప్రేమించి వివాహమాడుట, వారికి హంపీరుడు పుట్టుట. ఇందు వర్ణితము.

25. బాలశిక్ష: పద్యములు 6. 1934 సం॥న దక్కన్ కేసరి పత్రికలో ప్రకటితములు. 150 సంవత్సరముల నాటిదిగా కనిపించుచున్న యొక తాళపత్రగ్రంథము, వచనము, తమవద్ద నున్నదట. అందు నీతులు మంచిమంచి యుపమానములతో నున్నందున వానిని పద్యములుగా వ్రాసినారట రెడ్డిగారు.

26. తింత్రిణీ: పద్యములు 3. 1934 సం॥న గోలకొండ పత్రికలో ముద్రితములు. ఉస్మానియా యూనివర్సిటి ప్రొఫెసరొకాయన చింతపండు తినుటవలన దక్కను లోని పురుషులు పుంస్త్వహీనులును, స్త్రీలు మదవతులును నైనారని చెప్పినాడట. ఈ మాటమీద నాడు దేశమున కొంత యలజడి గూడ రేగినదట. ఆ సందర్భమున

వ్రాయబడిన పద్యము లివి. ఇందలి "హా తెలిసెన్ త్వదీయ గుణమంతయు" అను పద్యము "స్తుతమతియైన ఆంధ్రకవి ధూర్జటి పల్కుల కేల కల్గెనో అతులిత మాధురీ మహిమ?" అను కృష్ణరాయల ప్రశ్నమునకు సమాధానముగా రామకృష్ణ కవి చెప్పినట్లున్న "హా తెలిసెన్ భువనైక మోహనోద్ధత సుకుమార వారవనితా జనతా ఘనతాపహారి" అను పద్యమును స్మృతికి దెచ్చుచున్నది.

27. పేడి : రెండు పద్యములు. 1934 సం॥న గోలకొండ పత్రికలో ముద్రితములు. విభుల వెంట దిరుగాడు పేడివారిని గూర్చి చెప్పినవి. క్రీడాభి రామమునందలి పద్యముల వలె నున్నవి.

28. భావకవి నైతినోయ్ : ఇది గేయము. 1935 స॥న గోలకొండ పత్రికలో ముద్రితము. భావ కవులను, కవిత్వమును హేళన చేయు రచన యిది.

29. గ్రామ్యం బెబ్బులి : ఇది తందాన పాట. 1935 సం॥న గోలకొండ పత్రికలో ముద్రితము. ఇది వ్యాకరణము నిరసించిన ఒక వ్యావహారిక భాషావాది వాదనము విన్న తరువాత చమత్కార గర్భముగా వ్రాయబడిన పాట.

30. హస్తమా : పద్యములు 3. 1936 సం॥న గోలకొండ పత్రికలో ముద్రితములు. పేరూరు గ్రామమున రెడ్డిగారు జారిపడుటవలన చేయి విరిగినదట. ఈవిషయము నెరిగిన ఒకడు రెడ్డిగారు కల్లుత్రాగినందుకై పున చేయి విరుగబడినదని ప్రచారము ప్రారంభించెను. ఆ విషయము

నాయన త్రిలోకసంచారి యను పేరుతో రెడ్డిగారికే వ్రాసి నాడట. అపుడు ఎడమచేత వ్రాయబడిన పద్యము లివి.

31. ఉగాదికోరిక : ఒక గీతపద్యము. 1938 సం॥న గోలకొండ పత్రికలో ముద్రితము. బహుధాన్య ఉగాదికి వ్రాసినది.

32. సూతాఖ్యాయిక : ఈ శీర్షికతో 8 పద్యములు 1944 ఫిబ్రవరి 27 తేది 'తెలంగాణ పత్రిక'లో ప్రకటింప బడినవి. అధోజ్ఞాపికలో "కవిగారి అముద్రిత సూతాఖ్యా యికా గ్రంథభాగము" అని యున్నందున సూతాఖ్యా యిక అనునదొక గ్రంథమని స్పష్టమగుచున్నది. అది యింకను లభింపలేదు. తెలంగాణము పత్రికలో ప్రకటింప బడిన పద్యములనుబట్టి చూడగా అవి గ్రంథప్రారంభము లోనివి గాతోచుచున్నవి. అందలి మొదటి పద్య మిది.

"సారోదార విచారసాగర నిమజ్జత్‌స్ఫార విజ్ఞాని బృం
దారాధ్యంబగు నైమిశాటవిని, ఋష్యాదుల్ దగన్,
సూతునిన్
గారాబంబునగాంచియిట్లనిరి; నీగాథల్ తమిన్‌వింటిమిం
కేరీతిన్, భరతావనిన్ జరుగువిన్పింపంగ దేయియ్యెడన్"

ఇక సూతుడు భారతదేశమున మొన్న మొన్నటిదాక నున్న సాంఘిక, రాజకీయ, నైతిక పరిస్థితులను పేర్కొని, ఇక భారతావని యిట్లుండుననని చెప్పను.

33. అస్తినాస్తి విచికిత్స: పద్యములు 5. 1948 గోలకొండ పత్రికలో ప్రకటితములు. ఇది దేవునకు సంబంధించిన అస్తినాస్తి విచికిత్స. చమత్కార గర్భము.

34. గద్వాల సంస్థాన భాషాపోషణ: పద్యములు నాలుగు. రచనాకాలము 1943. ఇది గద్వాల సంస్థాన మహారాణి ఆదిలక్ష్మిదేవమ్మ బహద్దురువారి సన్నిధిలో చదివినవి.

35. మాతెనుగు: ఒక సీసపద్యము. రచనాకాలము 1943. ఆంధ్ర భారతిని గూర్చిన ప్రశంస.

36. తుంగామాత: పద్యములు 3. కర్నూలునుండి ప్రకటింపబడు 'విద్యుల్లేఖ' అను పత్రికలో 1944 సం॥న ముద్రింపబడినవి. తుంగభద్రా నదీ ప్రశంస యిది.

37. వసంతము: పద్యములు 5. 1952 సం॥న ప్రజావాణిలో ముద్రింపబడినవి. వసంతర్తు శోభ యిందు వర్ణితము.

ఇది స్థూలముగా నావద్దకు వచ్చిన రెడ్డిగారి పద్య రచనల వివరణము.

ప్రతి పద్యరచయిత కవికాడు. నేనీమాటనగనే ప్రతి కవియు, పద్యములు వ్రాసినవాడు కానక్కరలేదను సిద్ధాంతమువంటి వాక్యము పుట్టును. కవియైనవాడు తప్పక పద్య

ములనే వ్రాయవలయునని నే ననను గాని ఒక ఛందోమార్గ మును మాత్రము తప్పనిసరిగా అనుసరింపనిదే, వాడు కవి యైనను, తత్కృతము కవిత్వము కాదను గట్టినమ్మకము గలవాడను నేను. పద్యరచయిత అగుటమూలమున రెడ్డిగారు కవి కాలేదు. కవిత్వము వ్రాయుటవలన ఆయన కవిఅయెను. ఆ కవిత్వమును వ్రాయుటలో ఆయన సంప్రదాయసిద్ధ మైన ఛందోమార్గమునే అనుసరించెను. ఇట్లనుటవలన రెడ్డి గారిదైన నవ్యము ప్రత్యేకము ఏమను సంశయముకలుగును. ఆయన చేసిన క్రొత్తసృష్టి లేకపోలేదు. అదియును సంప్ర దాయగర్భమే. క్రొత్తసృష్టియన్నది అసలుకవిత్వమునకు సంబంధించి యుండును గాని ఛందమునకుగాదు. ఛందము శరీరము ప్రజ్ఞాజన్యమగు భావుకత ఆత్మ. ఈ రెండును ఏకరూపమున ప్రకాశించును. ఆ ప్రకాశమునకు కవిత్వమని పేరు. కవిత్వమును గూర్చినచర్చ ఇంతకుమించి అనవస రము. ఏమనగా ఎంత చేసినను అది ఇంతట అంతట తేలు నదిగాదు.

ప్రజ్ఞాజన్యమైన భావుకత అన్నది విరాట్స్వరూపము వంటిది. అది సహస్ర ముఖము. అందు ఊహ కల్పనము. కథాకథనము, వస్తువర్ణనము, ఉక్తి చమత్కారము అన్నవి ప్రధానములైన చతుర్ముఖములు. అ భావుకత కాత్మ ఔచి త్యము. అనగా ఔచితీ పర్యాప్తములైయవి కవితాస్వరూప మును తాల్చునన్న మాట. ఈ కవితాస్వరూపమును చుట్టు కొని కవిదైన ఆత్మీయత వొంగును. నేను పేర్కొనిన

రెడ్డిగారి రచనలలో కొన్ని కథలు, కొన్ని స్మృతులు కొన్ని ప్రశంసలు, కొన్ని అధిక్షేపములు, కొన్ని నైతికములు ఇత్యాదు లున్నవి. అందుగల పెద్ద రచనలు ప్రేమార్పణము, పద్మిని ధర్మాసనము హంవీర సంభవము మొదలైనవి. ప్రేమార్పణమందలి వస్తువు కవిత్వము. కలమునకును ప్రేమకును సంబంధ ముండదను తత్త్వరహస్యమును ప్రపంచించు నూహతో అది కల్పింపబడినది. తానెంత చెప్పినను కుమార్తె విననందున ఆమె ప్రియుని సంహరించుటకు భటుల కాజ్ఞ యిచ్చినాడు మహీపతి. ఆ సన్న మరణుడైన ఆమెప్రియుడు రాకుమార్తె కొక లేఖ నంపినాడు. అందు వ్రాసినాడు.

ఆత్మబంధులు లేరు నాకవనిలోన
'గోర్ల' మందయె నా యాస్తి కొనుము దాని
దాని రక్షించు భారమంతయును నీదె
అంత్య విజ్ఞాపనం బిదె యవధరింపు.

నాకీ నేలమీద ఆత్మబంధువులు లేరు. నీవు సౌధాగ్రములలో నున్నావు. నేను మరణించుచున్నాను. నేను మరణించిన వెనుక నీవు నీ యంతఃపురమున నిలువలేవు. అపుడు నేలకు దిగివత్తువు. కాని నేనుండను. నా యునికికైన నా గొర్లమంద యుండును. నేను లేనందున అది చెల్లాచెదరయిపోవును నేను లేననుచింతలో మునిగి తేలక ఆ మందను నాబదులు నీవు రక్షింపుము. దానిని నీదానిగా

చేసికొనుము. నీ నాథను కావలసిన నేను కాక పోవుచు నా దైనదానిని నీపరము చేయుచున్నాను నాదన్నదానిని రక్షించినచో నన్ను రక్షించినట్లే. ఇపుడు నీతండ్రిచే నడి పింపబడుచున్న ఈ మరణ దండనమునుండి నన్ను రక్షింపు మనుట లేదు. రక్షింపలేవు కూడాను. నీ కేది చేతనైనదియు నాకు తెలియును. తెలిసియే ఈ నా అంత్య విజ్ఞాపనము. ఆ పద్యమునందలి తాత్పర్యమిది. ఈ తాత్పర్యబోధ మామెకు కలిగినది. తదనుగుణముగా చేసినది ఇంత భావ నను రెడ్డిగారాపద్యమున నిమిడ్చిరి. రెడ్డిగారు ప్రజ్ఞాచక్షు వులు. ఆ పద్యమున మరొక పరమోత్కృష్టమైన అన్యార్థ స్ఫురణమున్నది. ఆ గొల్లవాడు తన ప్రియురాలి నర్థించినది తన గొర్లను రక్షింపుమని. తాను చనిపోవుచున్నను తన గొర్ల కట్టిస్థితి పట్టరాదని వాని యూహ. అది వాని పరమ జీవకారుణ్యదృష్టి. ఆ గొల్లవానికున్న ఆపాటి జ్ఞానమూ మహీపతికి లేదు. ముఖ్యార్థము బాధింపని ప్రయోజనము వలననైన అన్యార్థమిది. రెడ్డిగారీ కథాఖండికను వ్రాయు టలో చేసిన మరొక చమత్కార మిందెవరికిని పేర్లు పెట్ట కుండుట. నాకు తెలిసినంతవరకు పేర్లులేని పాత్రములు సంస్కృతమున అగస్త్యభ్రాత, యక్షుడు, వానిభార్య; తెనుగున నిగమశర్మ అక్క మాత్రమే. వాల్మీకియు ఫలానావాని సోదరు డనినాఁడు. రామకృష్ణుడును ఫలానా వాని యక్కయనినాడు. కాళిదా సావనికూడ చేయక ఊరక యక్షుడనినాడు. రెడ్డిగారు కాళిదాసు ననుసరించి నారు. ఒకరాజుగారి కూతురొక గొల్లవానిని ప్రేమించినదని

కథను రససీమలకు గొనిపోవుట ఉత్తమ కవితాశక్తికి సం బంధించిన విషయముగాని మరొకటిగాదు.

దను కవధియున్నంతలో ప్రతాపరెడ్డిగారు కథను నాటకీయ మార్గముల నడిపింతురు. పద్మిని కథాఖండికలో ప్రతాపసింహ, అజితసింహుల సంభాషణమిందు కొక నిద ర్శనము. వారి సంభాషణమునందే కథాసంబంధి జీవనా డిలోని కదలిక యున్నది. "నేటి చిత్రంబు వింటిరే నెలత యొకతె" అని ప్రతాపుడు ప్రారంభించి చెప్పినదానికి "ఓయి! నాకూర్మిపుత్రి యాయువిదసుమ్ము" అని అజితసిం హుని ప్రత్యుత్తరము. వారిరువురును పరస్పర నభిముఖులై కూర్చుని సంభాషించు చిత్రమును మూర్తికట్టించు రచన యది. పాత్రల నున్మీలనము చేయుటయందు రెడ్డిగారీ ఖండికలో నొక కొత్తమార్గ మవలంబించినారు. పాత్ర వర్ణనమునకంటె చిత్రణము గొప్పది. ఈ చిత్రణము సామా న్యముగా మూడుమార్గముల ననుసరించును. పాత్రముల చేతను — మాటలను - ఇతరుల వ్యాఖ్యానమును అనుస రించి చిత్రణము రక్తికట్టును. రెడిగారు ఈ మూడింటిని వదలి మరొక పద్ధతి ప్రవేశపెట్టినారు. పాత్రము యొక్క వంశౌన్నత్యమును వర్ణించి పాత్రవిషయమును సహృదయు లయిన పాఠకుల యూహకు వదలిన పద్ధతి యది. ప్రతాప సింహుని పాత్రమును ప్రవేశపెట్టుటకుముందు

ముసలమానులు రాజులై యొసగినపుడు
హిందువులు ఖిన్నులై భంగ మొందినపుడు

ఐకమత్యము నాశనం బైన యపుడు
కులము లన్యోన్య వైరంబు కూర్చినపుడు
భరతఖండము చెడి పాడుపడిన యపుడు
రాజపుత్రుల స్థానము రాజ్యపదవి
పీడకుండగ గాంచెను వీరవరుల;
వారలన్ ధైర్యలక్ష్మిలు పాయకుండె
వారిలో నైకమత్యము ప్రబలియుండె
వారిలో ధర్మగుణములు సేరియుండె
వారి కాత్మ గౌరవ మన్న ప్రాణసమము
రాజపుత్రులు సూరులు తేజమందు
రాజపుత్రులు శూరులు రణమునందు.

అని చెప్పి తరువాత

ఇట్టి రాణోడు వంశమం దెసక మెసక
బలపరాక్రమయుక్తిచే బరెగ నొకడు
అల "ప్రతాపసింహు" డనంగ యశమునొందె.

అని ప్రతాపసింహుని ప్రస్తావించినారు ప్రతాపరెడ్డిగారు. అనగా ప్రతాపసింహుడు ధైర్యలక్ష్మి, ఐక్యమత్యస్వభావము, ధర్మగుణము, ఆత్మగౌరవము, సూర్యతేజము, రణశూరత ఇవన్నియు ఏకరూపము కాగా నైనవాడని భావము. ఇవన్నియు రాజపుత్రవంశసంబంధి గుణములు. అనగా రక్తగతములని యర్థము. రక్తగతగుణము తెచ్చికోలు గుణముకంటె నేయిరెట్లు గొప్పది. అసలా రెంటికినిపోలికయే లేదు.

తెచ్చికోలు గుణములన్నియు మోహవివశములు. రక్తగీత గుణములు అచ్ఛమాశీలములు. అచ్ఛమైన ఈ శీలము రాజపుత్రవంశస్థము. తద్వంశభవుడు ప్రతపసింహుడు. తరువాత నడిచినకథయంతయు అచ్ఛమైనయాశీలమునాధారముచేసికొనినడిచినదే. కుమ్మరిపురుగువలెఎంతఅంటీఅంటకయున్నట్లున్ననురచయితలమీద సాంఘికపరిస్థితుల ప్రభావము పడక తప్పదు. అందులో సాంఘికజీవనమున మునిగితేలిన రెడ్డిగారి రచనలునాటిపరిస్థితులను ప్రతిబింబింపకతప్పవు. నేను 'పద్మిని' లోనివిగా పైన నుదాహరించిన పంక్తులను మరల చదివి చూచినచో నాటిపరిస్థితులు, వానికి తగిన రెడ్డిగారు చేసిన ఒక ప్రబోధము పాఠకులు గుర్తింపగలరు. ధర్మాసన మన్న ఖండిక సాంఘికముగానున్న కొన్ని విశ్వాసములను, కొన్ని హెచ్చులొచ్చులను కించిదవహేళన గర్భముగా చిత్రించినది. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు తమతమకున్న అవధులలో మంచి చెడుపను చేసినారు. మంచిని మాత్రమే యమునితో నివేదించుకొనినారు. చిత్రగుప్తుడు మాత్రము వారివారి చెడుచెయిదములనె ఉదాహరించినాడు. యముడు మంచి చెడులతో నిమిత్తము లేకుండ తీర్పుల నిచ్చినాడు. వీరితోపాటు రెడ్డిగారు యముని సన్నిధానమున కొక ఆదిహిందువు (పంచముడు) ను గూడ పంపినారు. వాని విషయమున యముడు "గుణము లెల్ల చెడు వీని కులముచేత" నని నరకాన వేయుమని తీర్పు నిచ్చినాడట. సోమయాజి విషయమున "ధరణీసురు లేమిచేసిన తప్పులేదు" అని స్వర్గమున కంపినాడట. ఆ మాదిహిందు

వుగూడ కొంత మంచి కొంత చెడు చేసినాడు. అయినను చిత్రగుప్తుడు "ఇతనియం దేశప్వాలేదు" అనినాడు - ఇట్లు వ్రాయుట ఏమి చెప్పుననగా వర్తమాన సాంఘిక పరిస్థితులు రచయితలపై ఎట్టి ప్రభావమును చూపునో చూడమని చెప్పును. ఈ మధ్యకాలమున బ్రాహ్మణులయం దొక అసహ్యభావమును - అది హిందువులైన మాలమాదిగలందొక ఆదరభావమును దేశమున వ్యాపించినది. ఇందుకు హేతువు ఆయా వర్ణములవారి స్థితిగతులే. రచయిత వీని కన్నింటికి అతీతుడుగా నుండవలయును. కాని చాలమంది యుండలేరు. ప్రతాపరెడ్డిగారి రచనలో పైన నేను చెప్పిన దేశము నంతయు నావరించిన భావనకు లోబడినారు. ఇదంతయు నేల చెప్పుచున్నాననగా రచయితకు సంఘము నందలి వర్తమాన పరిస్థితులకును గల దగ్గరతనమును చూపించుటకే.

ప్రాత విషయమును - పది మంది చెప్పినదానినే తాను తిరిగి చెప్పుచు ప్రతిభావంతుడైన కవి సరిక్రొత్త దానినిగా మలిచిచూపును. ప్రతాపసింహుడు పద్మినిని చూచినాడు. ఆమె దట్టమైన పొదలతో నున్న యొకకోనలో నుండగా చూచినాడు. ఆ స్థితిలోనున్న ఆమెను వర్ణించుచు రెడ్డిగారు.

జలదముల వెల్గు జాబిల్లి చంద మొప్పి
మోము గుండ్రన చెక్కులు ముకురయుగము

నయనములు పెద్ద నడుము సన్ననిది మిగుల
మెఱుపువలె మాయమయ్యెను గజితయపుడు.

అని వ్రాసినారు. ఆ వాక్యముల నట్లు కూర్చుటలో గల ఉక్తి చమత్కారమటుంచినచో ఆ రూపచిత్రణమున రెడ్డి గారు చూపిన ప్రతిభ గొప్పది. మునుముందామె జలదముల వెల్గు జాబిల్లివలె నున్నదట. జలదమనగా మేఘము. జలమునిచ్చునది యని యర్థము. ఇచ్చుటకు ముందది దానితో కూడుకొని యుండవలయునుగదా? అనగా జలముతో కూడుకొనిన మేఘమని. ఇట్లనుటవలన వర్షర్తువునందలి మేఘమని తాత్పర్యము. వర్షర్తువునందు మేఘములు కాటుకకొండలవలె నుండును. మదపుటేనుగులవలె నుండును. అనగా నల్లగా నుండునని యర్థము. అట్టి నల్లని వర్షఋతువునందలి మేఘములలో జాబిల్లి తోచిన ఎట్లుండునన్న విషయ మూహించుకొనవలసినదే. ఆ కోనలోని పొదలు దట్టముగా వర్షర్తునందలి మేఘములవలె గుబురుగుబురుగా నున్నవి. ఆ గుబురులలో పద్మిని ప్రతాపునకగుపించినది. జలదముల వెల్గు జాబిల్లివలె అగుపించినది. జలదమునకు వెలుగునిచ్చు జాబిల్లి చందమున పద్మిని ఆ కోనలోని పొదరిండ్లను ప్రకాశింప జేయుచున్నదని గూడా చెప్పుకొనవచ్చును. జలదముల వెలుగు జాబిల్లివలె మసకమసకగా కనిపించిన పద్మినిని పరకాయించి చూడగా గుండ్రని మోము, ముకురములవంటి చెక్కులు, పెద్ద నయనములు, కనిపించినవి. నడుమును కనిపించినది. బహుసన్నముగా కనిపించినది. ఇంతలో కనిపింపలేదు. మెఱుపువలె

మాయమైనది. మాయమైనది నడుము మాత్రమెగాదు. ఆమెయే మాయమైనది. ప్రాచీనమైన ఉపమాద్రవ్యమునే ఉపయోగించి రెడ్డిగారు సరిక్రొత్త చిత్రమును చిత్రించి నారు.

పెద్ద ఖండికలలోని విశేషములు స్థూలముగా చూపి నాను. లఘుఖండికలు చాలయున్నవి. అందు ప్రధాన ములు, నీతిబోధకములు, దేశభాషాభిమాన ఉద్దీపక ఉద్బో ధకములు. నీతిప్రబోధక పద్యములలో రెడ్డిగారు వేమనను తలపింతురు. ఉచితములైన దృష్టాంతములతో రెడ్డిగారు వ్రాసిన "నీతిపంచకము" లీవిషయమున నిదర్శనము. ఉదాహరణమునకు ఈ సంచికలోనే

మలయజము నీడ సర్పంబు మసలినటుల
గర్వమొప్పును బండిత గ్రామణులకు
స్వర్ణ భూషణమందుండు వజ్రమటుల
వినయమొప్పును విద్యా వివేకులకును.

అను పద్యమాదిగాగల నీతి పంచకము ప్రచురింపబడినది. "బాలశిక్ష" అను ఖండికలోని

సుజన సహవాసి యంతట స్తుత్యుడగును
దుర్జనుని గూడు పురుషుండు దూష్యుడగును
పానయోగ్యమా రేగటి వాననీరు
క్షారమై పరిహార్యమా చౌటనీరు

అను పద్యము మరొక యుదాహరణము.

దేశ భాషాభిమానముల ఉద్బోధమును చేయు ఖండికలు "ప్రబోధము" "స్వాగతము" "మా తెనుగు" ఇత్యాదులు. ప్రబోధములోని ఆంధ్రదేశమును కూర్చిన ఈ క్రింది పద్యమును చూడుడు. ఇది 1922 సం॥న వ్రాయబడినది.

ఒకనాడు పూర్వాపరోధధి వేలల
వ్యాపించి మించెను వన్నె చెలగ
ఒకనాడు వింధ్యాచలోత్తుంగ శిఖరంబు
పైనుండి యంతట పాఱజూచె
ఒకనాడు పటుభీకరోగ్రాము శక్తిమై
భామినీపతుల సలాము లందె
ఒకనాడు శాకతి ప్రకటిత బలముచే
సంగ్రామ విజయధ్వజంబు నెత్తె
అట్టి సాహసంబులు జేసె నాంధ్రమాత
తన కుమారులు శూరులై తనరు కతన
మరల యుద్ధరింపుడు మన మాతృభూమి
నఖిల విద్యాజనిత సద్గుణాఢ్యులార.

తెనుగు భాషా సాహిత్యముల నవగతము చేసికొని సముచిత రీతి నుద్ధరించుకొనుడని ప్రబోధించు వైతాళికుడైన ప్రతాపరెడ్డిగారు తెనుగును ప్రశంసించుచు వ్రాసిన "మా తెనుగు" పద్య మీ క్రిందిది.

పరిపూర్ణ పావనాంభస్తరంగోద్వేగ
గౌతమీ గంభీర గమనమునకు

ఆలంపురీ నంద నారామ విభ్రాజి
మల్లోబ ఫలరాజి మధురరుచికి
ఆంధ్రీకుమారీ సమాయుక్త పరిపూత
తుంగా వయస్సు మాధుర్యమునకు
ఖండశర్కర జాతి, ఖర్జూర, గోక్షీర
ద్రాక్షాదియుత రామరసమునకును
అమృత నిష్యంది వల్లకీ ప్రాదమునకు
రాగిణీ దివ్య సమ్మోహ రాగమునకు
తేనె తేటల నవకంపు సోనలకును
సాటియగును "మా తెనుగు" భాషామతల్లి.

ఇటువంటిదే "మిత్రుడా" అను గేయమును.

ఇవిగాక లఘుకృతులలో "భావకవి నైతినోయ్" వంటి అధిక్షేపములు, "గ్రామ్యం బెబ్బులి"వంటి అవహేళనములు, "హ స్తమా" వంటి ప్రాసంగికములు, "మిత్ర స్మృతి" వంటి స్మృతులు ఇత్యాదులు చాలయున్నవి. వాని నన్నింటిని నా యీ వ్యాసమున వివరించి పరిచయము చేయుట కవకాశము లేదు. పరమేశ్వరు డనుగ్రహించి ప్రతాపరెడ్డిగారి పద్య కృతులు గ్రంథరూపమున వచ్చి నపుడు దేశము చదివి ఆనందింపగలదు.

ప్రతాపరెడ్డిగారి ఛందోమార్గమును గూర్చి నాల్గు మాటలు వ్రాసి ఈ వ్యాసం ముగింతును. ఆయన తన రచనలో చాలవరకు,గీతములనే వాడెను. తరువాత సీసములు ఇత్యాదులు. మనము పద్యమనగనే నాల్గు పాదములు

కలదిగా సామాన్యముగా నూహింతుము. రెడ్డిగారు రెండు పాదముల గీతములను "పరుసవేది" అనుఖండికలో వ్రాసినారు. మరొకటి శేషము "వెట్టివానిపాట" అను దండక విషయమున నున్నది. దండకములలో చాలభేదములున్నవి. అప్పకవ్యాదులు కొన్నింటిని పేర్కొనిరి. అవిగాక వృత్తరత్నాకరమున నింకను బహువిధములైన దండకములు పేర్కొనబడి యున్నవి. న, స, హ, త గణములలో దేనితోనైనను దండకము ప్రారంభించి వ్రాయవచ్చునని తెనుగులాక్షణికులందరును చెప్పిరి. తెనుగు దండకములు చాలవరకు తగణముతోనే యున్నవి. నగణముతో ప్రారంభింపబడిన దండకములు గూడ కొద్దిగా నున్నవి. ప్రతాపరెడ్డిగారు రగణముతో దండకమును వ్రాసినారు. నగణములు రెండింటి మీద పదునాల్గు వరకు రగణములుంచి దండకములు వ్రాయవచ్చునని అప్పకవి చెప్పినాడుగాని రగణముతో దండక ప్రారంభమును చెప్పలేదు. సంస్కృతమున మాలతీమాధవమున భవభూతి రెండు నగణముల మీద పదునారు రగణములను గూర్చి దండకమును వ్రాసినాడు. వరాహమిహిరసంహితయందు ముప్పదిరెండు రగణములను నిలిపిన దండకమున్నదట. అంతేగాని రగణముతో ప్రయుక్తములైన దండకములను వృత్తరత్నాకరమును పేర్కొనలేదు. శ్రీయుతులు నిడుదవోలు వెంకటరావుగారు "పరిశోధన" (1955 ఏప్రిల్, మే) లో 'దండక వాఙ్మయము'ను గూర్చి వ్యాసమును వ్రాసినారు. అందును రగణముతోడి దండకములున్నట్లు పేర్కొనబడలేదు. ఈ

విషయమును ఇంకను పరిశీలించి రెడ్డిగారనుసరించిన పద్ధతికి మూలమైన ప్రమాణమెచటనైన ఉన్నదో లేక అది రెడ్డిగారి సృష్టియో తెలిసికొనవలసియున్నది.

ప్రజ్ఞాను ఘనులైన ప్రతాపరెడ్డిగారి కవిత్వమును స్థూలముగా నీ వ్యాసమున పరామర్శించి చూపినాను. అంతయును ప్రశంసయేగాని విమర్శనమువలె లేదేమి వ్యాసమని కొందరు మిత్రులనవచ్చును: నిజమునకిది ప్రశంశయుగాదు; కేవలము పరిచయము మాత్రమే. అయినను రెడ్డిగారిని మహాకవియని నేనేమి ఆకాశమున కెత్తలేదు మధ్యతరగతి కవులలో ప్రతాపరెడ్డిగారికి సముచితమైన స్థానమున్నది. అయనదైన ఒక ప్రజ్ఞను ప్రశంచించు భావమే ఈ వ్యాసమునకు మూలము. ఆ భావము కృతకృత్యమైనచో చాలును—భవతు. ఇతిశివమ్.